# ర స మ ం జ రి



తెనుగు–పద్యకావ్యము

క వి


తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులు

పెన్షన్డు డెప్యూటితహశ్శీల్దారు

రాజమహేంద్రవరము






సరస్వతీ పవర్ ప్రెస్సులో ముద్రితము

రాజమహేంద్రవరము

1926


---



వెల  అరు అణా

# PREFACE

THE Rasamanjary is a poem on rhetoric, written in Sanskrit, by Bhanu, an ancient poet. The meaning of the term Rasamanjary is a nosegay of *rasams.* By *rasam*, is meant passion or pathos which has been pronounced, by great European Critics, to be the all-in-all in poetry. It has been described by Sanskrit rhetoricians to be the definitive impressions created, in the minds of readers of books, or of audience at a dramatic performance, by the consciousness of the enjoyment of pleasure and pain, of the personages spoken of in books, or represented on the stage, when such definitive impressions attain a stage at which the minds of such readers, or of such audience, are enchanted or carried away. The book treats of the passion of love alone, out of the nine kinds into which passions have been classified by Sanskrit rhetoricians. The passion of love is called *Sringaram* in Sanskrit and the author would have done well had he named it "Sringararasamanjary."

2. In the Rasamanjary, the rules are given in prose and the illustrations in verse. The illustrations, which consist of one hundred and thirty quatrains, are full of great pathos and beauty, and the reader will have emotions of the liveliest satisfaction and sympathy. Each verse may be said to be a drama in which, to use the words of poet Dryden, "the action love as well as the passion have been "brought to an exact perfection", to such an extent that the reader feels that, in fact, nature speaks and that the represented facts themselves speak.

3. I read the Rasamanjary in the year 1915, when I was of opinion that it would be a very good acquisition to Telugu literature, if it was translated into Telugu. At that time, I also had in my view the great desideratum that, owing to a lack of its translation in Telugu, had been sadly felt by the Board of Studies, which I heard had prescribed as a text-book in Telugu for the *Vidvan* examination, the notes alone written to it in Telugu by Mr. Vedvam Venkataraya Sastry, a retired Educationist. Accordingly, I translated it that very year. As in my translations of other works—both Sanskrit and English—I have, in this case as well, closely and faithfully followed the original. It is a verse-for-verse translation. I now print it and give it to the public in the hope that it may be found to be most useful to Telugu Scholars.

4. I must also remark that in his arrangement of *Parakiyas*, who constitute one of the three main divisions, into which womankind have been classified by Sanskrit rhetoricians, Bhanu is a little inaccurate in one single instance, where-in he states that "Guptas and others" are included in *Parakiyas* whilest, according to the context, he should have stated, in strictness of speech, that they are included in *Parodhas,* one of the two sub-divisions into which Parkiyas have been divided. The inaccuracy is due rather to hastiness and would have been avoided had the author, whose talents are very great and whose expression is always very precise, revised his book before publication which is evidently a posthumus one. In my translation, I have ventured to correct this inaccuracy.

5. There is also an instance where Bhanu ha made a conflicting statement in his sub-division (

125

the *Upapaties*, one of the three kinds of lovers into which mankind have been classified. The confliction is, in my view, apparently due to his overzeal in going to extreme minuteness in his classification of lovers, unlike other rhetoricians. I have thoroughly discussed it and have made a critical note of it in my Telugu preface and, if my scholar-readers disagree with me and give their reasonable grounds, I shall be glad to accept their view and to thankfully change my view and publish the same in my preface to the second edition of this book.

Rajahmundry,<br>8th March 1926. } Tadury Lakshmi Narasimha Rao

# రసమంజరి

## పీఠిక

రసశబ్ద మనుభవమను నర్థమిచ్చు రసను సంస్కృతధాతువువలననుండి పుట్టినది. కాఁబట్టి సామాన్యముగా రసమనఁగా ననుభవింపఁబడునది యని యర్థము. అది జైహ్వికముఁ గావచ్చును. మానసికముఁ గావచ్చును. జైహ్వికములనఁగా జిహ్వచే ననుభవింపఁబడునవి. మానసికములనఁగా మనస్సుచే ననుభవింపఁబడునవి. జైహ్వికరసములు భోజనములో ననుభవింపఁబడు లవణాదిషడ్రసములు. మానసికరసములు శ్రావ్యదృశ్య ప్రబంధములగు కావ్యనాటకాదులమూలమున ననుభవింపఁబడు శృంగారాదినవరసములు. జైహ్వికరసములను విడిచి యీ ప్రబంధరసవిషయమును నే నిప్పుడు చెప్పుచున్నాను.

2. కావ్యమూలమునఁగాని యభినయమూలమునఁగాని నివేదింపఁబడు పూరుషుల సుఖదుఃఖాదుల యనుభవమువలనఁ బుట్టిన సంస్కారరూపమయిన సామాజికుల మనోవికారమును

సామాజికనిష్ఠమైనస్థాయిభావ

మని యాలంకారికులందురు. ఈ స్థాయిభావమే విభావాదులచే విశదింపఁబడి యానందరూపముగా ననుభవింపఁబడుటకుఁ దగిన దశను బొందింపఁబడినయెడల రసమనఁబడును. విభావమనఁగా రసోత్పత్తి కారణమని యలంకారశాస్త్రమందు గ్రహింపఁదగ్గది. అన్నమునకుఁ గూరలుఁ బచ్చళ్ళు మొదలగువాని మేళనముచే రుచి యెట్లుకలుగునో యట్లే విభావాదుల మేళనముచే స్థాయిభావమునకు రుచిగలుగును.

3. ప్రతాపరుద్రీయకారుఁడైన విద్యానాథుఁడు మొదలగు నాలంకారికులందఱును గావ్యము నొక శరీరమునకుఁ బోల్చి రసము దానికి జీవమనియు నుపమాద్యలంకారములు దానికి నగలనియును

వర్ణించియున్నారు. కావ్యమున కలంకారము ప్రధానము కాదనియు రసమే ప్రధానమనియు వారి ముఖ్యాభిప్రాయమైయున్నది. కాబట్టి యింతకుమున్ను క్రీ॥శ॥ 1903 వ సంవత్సరములోఁ జంద్రాలోకాలంకారశాస్త్రమును దెనిఁగించియున్న నాకు రసవిషయమైన శాస్త్రము కూడ రచియింపవలయునని యభిలాషపుట్టినది. అట్లగుటంజేసి తొల్లి సంస్కృతంబున భానుమిశ్రకవి రచియించిన రసమంజరి యను గ్రంథమును గ్రీ॥శ॥ 1915 వ సంవత్సరములోఁ జదివి యప్పుడే తెనిఁగించితిని. గ్రంథము చదువునప్పుడు చదువరుల మనస్సులు పరవశములై యానందరసపూరములో నోలలాడుచుండునను నింతకంటె మిక్కిలి యీ చిన్నపీఠికలో భానుని రసమంజరి విషయమై చెప్పఁజాలను. నవరసములలో శృంగారరసముమాత్రమే రసమంజరిలో వర్ణింపఁబడియున్నది. ఈ కారణముచే దానికి భానుఁడు శృంగార రసమంజరియని పేరుపెట్టినేని బాగుగనుండును. అయినను నాయీ తెనుఁగుగ్రంథమున కాపేరేయుంచి యిప్పుడు ముద్రింపించి లోకమున కర్పించుచున్నాను.

4. మఱియు నింకొక్కటి చెప్పవలయునది యున్నది. భానుఁడు పరకీయానాయికను నిరూపించుచోఁ బరకీయ పరోఢయనియుఁ గన్యయనియు రెండువిధములదని చెప్పి యిద్దఱలక్షణములును సంపూర్ణముగా నుపన్యసించి యొక్క పరోఢకు మాత్రమే లక్ష్యమిచ్చినాఁడు. తోడనె కన్యకుఁగూడ లక్ష్యమియ్యక

గుప్తాదులు పరకీయయందే యంతర్భావమును బొందినవా

రనియొకసూత్రమిచ్చి యట్టియంతర్భూతలైన గుప్తాదులాఱువిధములవారికి లక్షణలక్ష్యములిచ్చి నాఁడు. అటమీఁదఁగన్యకులక్ష్యమిచ్చినాఁడు. భానుని యీసూత్రము నిర్దుష్టమైనయెడఁ గన్యాలక్ష్య మస్థానమూదూఁబడ్డది యగును. అప్పుడాలక్ష్యము పరోఢాలక్ష్యమిచ్చినతోడనె యియ్యవలయునదైయుండును. ఆసూత్రము నిర్దుష్టము కానియెడ

దానిని సవరించుట కర్తవ్యము. గుప్తాదులకు భానుఁడిచ్చిన లక్షణ లక్ష్యములను జూడఁగా వారుకన్యలలోఁ జేరరనియును బరోఢలలో మాత్రమే చేరుదురనియును దోఁచుచున్నది. ఈకారణముచే వారు పరోఢలలో నంతర్భావమును బొందినవారని చెప్పిన నొప్పుగనుండును గాని భానుఁడు చెప్పినట్లు పరకీయలలో నంతర్భావమును బొందినవారని చెప్పినయెడ నతివ్యాప్తిదోషము సంభవించును. కాఁబట్టి సూత్రము గుప్తాదులు పరకీయయందే యంతర్భావమును బొందినవారని భానుఁడు చెప్పినట్లు చెప్పక గుప్తాదులు పరోఢయందే యంతర్భావమును బొందిన వారని నా యీగ్రంథమునఁ జెప్పినవాఁడను.

5. మఱియునింకొకటి చెప్పవలయునది గలదు.

(1) నాయకుని నిరూపించుచో

"సచత్రివిధః పతిరుపపతి ర్వైశికశ్చేతి॥"

అనియును

(2) పతిస్వరూపము చెప్పుచో

"విధివత్ పాణిగ్రాహకః పతిః॥"

అనియును

(3) పతిభేదములు చెప్పుచో

"అనుకూలదక్షిణధృష్టశఠభేదాత్ పతిశ్చతుర్థా॥"

అనియును

(4) అనుకూలుని నిర్వచించుచో

"సార్వకాలికపరాఙ్గనాపరాఙ్ముఖత్వే సతి సర్వదా

"స్వీయాయామనురక్తోఽనుకూలః॥"

అనియును

(5) స్వీయను నిరూపించుచో

"తత్రస్వామిన్యేవానురక్తాస్వీయా సచపరిణీతా
"యాంపరగామిన్యా మవ్యాప్తిః అత్రపతివ్రతాయా
"ఏవలక్ష్యత్వాత్. తస్యాశ్చపర గామితయా పరకీ
"యాత్వమపి సమాయాతి"

అనియును భానుఁడు చెప్పినవాఁడు.

ఇందు మొదటినాలుగు సూత్రములంబట్టి—

(1) "నాయకుఁడు పతియనియు నుపపతియనియు వైశికుఁడనియు మూఁడువిధముల వాఁడనియును

(2) శాస్త్రప్రకారము పెండ్లియాడిన వాఁడు పతి యనియును

(3) పతి యనుకూలుఁడనియు దక్షిణుఁడనియు ధృష్టుఁడనియుశఠుఁడనియు నాలుగువిధములవాఁడనియును

(4) కలకాలము పరస్త్రీవర్జితుఁడై కలకాలము స్వీయమీఁదవలపుగలవాఁడనుకూలుఁడనియును

స్పష్టపడుచున్నది. అయిదవ సూత్రమునుబట్టి పతిమీఁదమాత్రమే వలపుగలదిస్వీయ యనియు వివాహితయైనను బరపురుషునితోఁ బోవుదాని కీస్వీయానామము చెల్లదనియు నిందుఁబతివ్రతమాత్రమే యుద్దేశింపఁబడ్డదనియు వివాహితకుఁబరపురుషగమనముచేఁ బరకీయాత్వమే యబ్బుననియును స్పష్టపడుచున్నది.

6. పయిమైదవగుంటి (paragraph) లోఁగనఁబఱచిన యంశములనుబట్టి యనుకూలనాయకత్వ ముపపతిని [అంకుమగనిని] బహిష్కరించుచున్నది. ఉపపతి యెన్నఁడు ననుకూలుఁడు కానేరఁడు.

7. సంగతు లిట్లుండఁగా నుపపతి స్వరూపము చెప్పుచో
"ఆచారహాని హేతుః పతిరుపపతిః"

అని చెప్పి

"ఉపపతిరప్యనుకులాదిభేదేన చతుర్విధః

"పరంతుశఠత్వంనియత మనియతమితరత్"

అనియు భానుఁడు చెప్పినవాఁడు. భానుఁడు చేసిన యనుకూల నాయకత్వ నిర్వచనముంబట్టి యుపపతి యెన్నఁడు ననుకూలుఁడు కానేరఁ డనిస్పష్టపడుచుండగా నుపపతి యనుకూలాది భేదంబులచే నలుఁ దెఱం గులవాఁ డగుననుట విరుద్ధముగా నున్నది. ఇందు భానునితో నే నేకీ భవింపఁ జాలను. ఆతఁడు లక్షణములు పత్యుపపతి భేదములకిచ్చి లక్ష్యములు పతిభేదములకు మాత్రమే యిచ్చినవాఁడు. ఉపపతి భేదములకు లక్ష్యములిచ్చినవాఁడు కాఁడు. తనయుపపత్యను కూలునకు లక్ష్యములేమిచేతనే యాతఁడీయ్యఁడయ్యెనని నాయ భిప్రాయము. ఈవిరుద్ధలక్షణమునకుఁ గారణము తనకుఁ బూర్వులైన యాలంకారికులువోలెఁ గాక పతులలో ననేకములయిన యవాంతర భేదములు కల్పించుటకు భానునకుఁ గలచిత్తాభిషంగమని నేను దలం చుచున్నాను. ప్రతాపరుద్రీయకారుఁడు భానుఁడువోలెఁ గాక తన యనుకూల నాయకున కనేకపత్నీకత్వము సంఘటించినవాఁడు. అనేక భార్యలుండినను నొక్కభార్యమీఁదనే విశేషానురాగము గలవాఁ డనుకూలుఁడని యాతఁడన్నవాఁడు. వానిననుసరించి ప్రతాపరుద్రీ యము తెనిఁగించిన మూర్తికవి వ్రాసియట్లు గాక

"ఒక్క కాంతకే!

"వలచి గుణాభిరాముఁ డగువాఁ డనుకూలుఁడు........"

అని చెప్పి మఱియొకసంది గ్ధాంశము తెచ్చిపెట్టినవాఁడు. వాని చేసిన నిర్వచనమునుబట్టి యనుకూలునినాయిక యొక్క కాంతయే కాని యది మూఁడు విధముల నాయికలలో నెట్టిదియైనను గావచ్చు ను. స్వీయయైనను బరకీయయైనను సామాన్యయైనను గావచ్చును.

ఈ లక్షణమం దతివ్యాప్తి దోషముగలదు. ప్రతాపరుద్రీయకారుని సూత్రముగాని మూర్తికవిసూత్రముగానినాకు సమంజసముగాఁగానిపించుటలేదు. వీరియట్లుగాక భానుఁడు తన యనుకూలనాయకునకుఁ బ్రశస్తమైన లక్షణముంచినవాఁడు. నాయికలలోఁ దనస్వీయ కెట్టిసుగుణములుపెట్టినవాఁడో నాయకులలోఁ దనయనుకూలున కట్టిసుగుణములు పెట్టినవాఁడు. మఱి యీ యనుకూలున కుదాహరణ మేకపత్నీవ్రతుఁడైన శ్రీరామచంద్రు నిచ్చినవాఁడు వాని శ్లోకము తెనిఁగించి యిందుఁ జూపుచున్నాను జూడుఁడు :—

సీ॥ భూమిదేవీనీవు కోమల కావమ్మ
 సూర్యుఁడా చల్లఁగాఁ జూడవయ్య।
గాలిదేవర నీవు కరుణతోఁజెమటార్చ
 చులుకనై మార్గమా వెలుఁగవమ్మ।
దండకారణ్యమా తగనీవుమాకు డ
 గ్గఱ రాఁగదమ్మ వేకరుణదాల్చి।
కొండలారా దారి నుండఁబో కవులకుఁ
 దొలగరమ్మా మీరు తోడుతోడ।
గీ॥ నింతయేమిటి కందు రే నెఱుఁగఁజెప్ప
వాఁడనువినుండు నేఁడు నాతోడఁ గూడ
నడవికిని దాను వచ్చెదనంచు నుత్స
హించుచున్నది యిదెసీత యిందువదన॥

భానుని స్వీయానాయికానిర్వచనమును వానియనుకూలనాయకనిర్వచనమును నాకుఁ బరమసమ్మతముగా నున్నవి.

ఈ కారణముచే నుపపతిభేదముల విషయములో భానునిపై

"ఉపపతిరప్యనుకూలాది భేదేన చతుర్విధః-ప
"రంతు శఠత్వం నియతమనియతమితరత్"

అను లక్షణము నేను దెనిఁగింపకదిగవిడిచి యాసంగతి సకారణంబుగ నీపీఠికలోఁ జెప్పుట మేలని యెంచితిని. ఎంచి కొందఱు పండితులతోఁ బ్రసంగించుటయు నవి తెనిఁగింపక దిగవిడుచుటకంటెఁ దెనిఁగించి నిలిపి నా యభిప్రాయము వెల్లడిచేయుట సమంజసముగా నుండునని వారు నుడివిరి. నేనెన్నఁడును బ్రకరణశుద్ధిగాఁ బ్రవర్తించు వాఁడ నగుటచే నామనస్సునకు నచ్చని సూత్రమును జెప్పనివాఁడ నైనను నప్పండితులు చెప్పినప్రకారము భానునిమాత్రము తెనిఁగించి యీ నా గ్రంథములోఁ జేర్చి యీ వ్యాఖ్య యిందుఁ బొందుపఱచిన వాఁడను.

రాజమహేంద్రవరము
8 మార్చి 1926.

తాడూరి లక్ష్మీనరసింహారావు



# శుద్ధపత్రిక.

| పుట సంఖ్య | | పద్యము సంఖ్య | | బంతి సంఖ్య | ఉన్న పాఠము | ఒప్పైన పాఠము |
|---|---|---|---|---|---|---|
| 2 | ... | 4 | ... | 3 | వీనునకె | వీనులకె |
| ,, | ... | 5 | ... | 2 | ఒడ్బుదనంబు | బడ్బుఁదనంబు |
| 3 | ... | 0 | ... | 18 | ఉనాహరణము | ఉదాహరణము |
| ,, | ... | 0 | ... | 25 | వర్తించ నే | వర్తించె నే |
| 4 | ... | 0 | ... | 2 | చెష్ట | చేష్ట |
| ,, | ... | 10 | ... | 4 | నిద్దురపోయి | నిద్దురవోయి |
| ,, | — | 11 | — | 1 | కవుంగలించి | కవుంగిలించి |
| ,, | ... | 12 | ... | 3 | సమయాంతమంనునఁగి | సమయాంతమందునతి |
| 5 | ... | 13 | ... | 3 | తామరాకుల వీవన దాల్చి లెస్స | తామరసపత్రముం దెచ్చిదానితోడ |
| 5 | ... | 13 | ... | 4 | లీతునా | వీఁతునా |
| 7 | ... | 19 | ... | 4 | పస్త్రపుచెంగులు | వస్త్రపుఁజెంగులు |
| 7 | .. | 21 | ... | 3 | చేతినిడి | చేతనిడి |
| 7 | ... | 21 | ... | 4 | కుల్కొగా | కుల్కొఁగా |
| 9 | ... | 23 | ... | 3 | నెలుకఁ | నెలుకం |
| 9 | ... | 24 | ... | 4 | దోప్పజూ | దోప్పఁజూ |
| 10 | ... | 29 | ... | 2 | నెమళ్లి | నెమిళ్లి |
| 11 | ... | 31 | ... | 3 | చెప్పగా | చెప్పఁగా |
| 12 | ... | 33 | ... | 2 | గవుంగలించె | గవుంగిలించె |
| 12 | ... | 34 | ... | 1 | మూతిపొందరింటి కేనివుపోతికాని | ఆరిగితివిదూతి పొదరింటికం తెకాని |

| | | | | |
|---|---|---|---|---|
| 15 | 0 | 20 | యేబది | యేఁబది |
| 16 | 0 | 9 | కలిపికొని | కలపికొని |
| 16 | 40 | 1 | తనలో | తనలోఁ |
| 16 | 41 | 2 | మేల్కొ లనూలు | మేల్కొలనూలు |
| 17 | 43 | 2 | దేలాలహో | దేరాలహో |
| 17 | 44 | 2 | నచ్చి | నచ్చి |
| 18 | 57 | 3 | వేడి | వేఁడి |
| 18 | 58 | 4 | పులుక్ చూపులఁ | పులుకుఁజూపులన్. |
| 19 | 52 | 1 | ఎట్లపాటితి | ఎట్టవాటితి |
| 19 | 53 | 2 | కోల పోతిని | కోలుపోయితి |
| 19 | 53 | 8 | నాఁటనునండి | నాఁటనయుండి |
| 19 | 53 | 4 | పెక్కెల్ల | పెక్కుళ్ళ |
| 20 | 54 | 2 | భాగ్యస్థానమంనున | భాగ్యస్థానమునయందు |
| 20 | 54 | 4 | యెవ్వాడు | యెవ్వాఁడు |
| 20 | 0 | 19 | కుదారదము | కుదాహారణము |
| 20 | 55 | 4 | యాత్స్యైక్యపుమాడ్కి | యాత్ప్యైక్యపుఁజూడ్కి |
| 21 | 67 | 4 | ,వేడెన్ | వేఁడెన్ |
| 21 | 58 | 5 | పరితపించుచు | పరితపింపుచు |
| 22 | 60 | 3 | దోరబండిన | దోరఁబండిన |
| 22 | 61 | 4 | గనుదమ్ముల్ | గనుఁదమ్ముల్ |
| 23 | 63 | 7 | దాఁన | దాన |
| 23 | 65 | 2 | మెఱయుచుండెడి | మెఱచుచుండెడి |
| 24 | 65 | 7 | నెదుఱుచూచుచు | నెదురుచూచుచు |
| 24 | 66 | 2 | బోకల | బోఁకల |
| 24 | 68 | 4 | 60 | 68 |

| | | | | |
|---|---|---|---|---|
| 25 | ... 69 | ... 1 | నిద్రపుచ్చు | నిద్రవుచ్చు |
| 26 | ... 71 | ... 2 | పిఱుదులో | పిఱిందిలో |
| 27 | ... 76 | ... 4 | జీకంటి | జీంకటి |
| 28 | ... 76 | ... 6 | బోంణి | బోణి |
| 29 | ... 82 | ... 3 | లాంఛ్రోరుల్ | లాంఛ్రోరుం |
| 30 | ... 82 | ... 6 | పయిన | పయిని |
| 30 | ... 83 | .. 3 | గైకదా | గాంగైక |
| 31 | ... 0 | ... 24 | కెడబాపు | కెడంబాపు |
| 33 | ... 87 | ... 1 | పైనను | పైనాదు |
| 34 | ... 90 | ... 4 | వేలుపుచెట్టు | వేలుపుంజెట్టు |
| 36 | — 92 | — 1 | జన్నుపైండిమల | జన్నుంబైండిమల |
| 36 | — 93 | — 1 | ప్రమోతలు | ప్రమోంతలు |
| 36 | — 93 | — 3 | మానసమంగునంగా | మానసమునంగునతా |
| 38 | — 100 | — 2 | దేమిటికి | వేమిటికి |
| 40 | — 0 | — 8 | చీకోట్లు | చీవాట్లు |
| 40 | — 103 | — 1 | గెలుదమ్మ్రులన్ | గెలుందమ్మ్రులన్ |
| 40 | — 103 | — 4 | సాచుండు | సాంచుడు |
| 41 | — 105 | — 1 | నొండ్రోరుల్ | నొండ్రోరుం |
| 41 | — 105 | — 3 | కౌంగలింపంగ | కౌంగిలింపంగ |
| 41 | — 105 | — 5 | బిల్పరు | బీల్పరు |
| 42 | — 106 | — 1 | ప్రమోతల | ప్రమోంతల |
| 42 | — 106 | — 2 | వెల్గుడు | వెల్గుచు |
| 42 | — 106 | — 3 | వెల్గును | వెల్గుచు |
| 43 | — 108 | — 3 | గేధూపమున్ | గేశధూపముల్ |
| 43 | — 109 | — 1 | ఎడందగు | ఎడందను |

| | | | | |
|---|---|---|---|---|
| 43 | 109 | 1 | సిగ్గురుం | సిగ్గునుం |
| 43 | 0 | 14 | మానిచతుగులు | మానీచతురులు |
| 44 | 112 | 3 | భవనమందున | భవనమునయందు |
| 44 | 113 | 1 | కన్నైన్వతె | కన్నైన్వతెది |
| 44 | 113 | 4 | తోండల్ | తోండల్ |
| 45 | 114 | 2 | గోఁడోక | గోండోక |
| 45 | 115 | 2 | నిర్వ్యక్రబు | నిర్వ్యక్రంబు |
| 45 | 114 | ... 3 | జఱునవ్వు | జిఱునవ్వు |
| 45 | 115 | 4 | స్మరింతుజుమీ | స్మరింతుంజుమీ |
| 46 | 116 | 7 | నింతయొని | నింతయేని |
| 46 | 0 | 11 | ధష్టత్వము | ధృష్టత్వము |
| 47 | 118 | 2 | డిటఁనుఁడి | డిటనుండి |
| 47 | 119 | 4 | జలము | జలము |
| 47 | 120 | 2 | విప్పఁబోతినే | విప్పఁబోవనే |
| 48 | 122 | 2 | గోళమునందునశువుల్ | గోళములయందశువుల్ |
| 49 | 128 | 2 | దంద్రుఁడుం | చంద్రుఁడుం |
| 51 | 0 | 4 | ప్రశస | ప్రశంస |
| 54 | 136 | 4 | వీఁడదయ్యో | వీడదయ్యో |



హితకుఁ బరపురుషగమనముచేఁ బరకీయాత్వమే యబ్బును. స్వీయ చేష్ట లెవ్వియనిన:—మగనిని గొల్చుట-నడవడి నిల్పికొనుట-తిన్నదనము-సైరణ-యను నీనాలుగును.

—• స్వీయకుదాహరణము •—

చం. కనుఁగొనదాఁకఁ బంపుఁ గులకాంత మఱల్చును జూడ్కి వేడ్కలం
దనదగు మోవిపైనె చిఱునవ్వును నిల్పును బల్కులైననో
తనప్రియభర్తపేనునకె తద్దయు పిందొనరించు నెన్నఁడే
మనమున నల్కపుట్టినను మానసమందె యడంగఁద్రొక్కెడున్. 4

స్వీయ ముగ్ధయనియు మధ్యయనియుఁ బ్రగల్భయనియు మూఁడువిధములు.

—• ముగ్ధ •—

ముగ్ధయనఁగా యౌవనమంకురించిన నాయిక. అది జ్ఞాతయౌవనయనియు నజ్ఞాతయౌవనయనియు రెండువిధములది. జ్ఞాతయౌవనయనఁగాఁ దనకు యౌవనము నచ్చినదని యెఱిఁగినది. అజ్ఞాతయౌవనయనఁగాఁ దనకు యౌవనము వచ్చినదని యెఱుఁగనిది. ఈముగ్ధయే కాలక్రమమున నవోఢయనియు విస్రబ్ధనవోఢయనియు ననఁబడును నవోఢ యనఁగాఁ గ్రొత్తపెండ్లామని శబ్దార్థము. రతిలో సిగ్గును బెదరును గలది నవోఢ. ప్రశ్రయముతో ననువర్తించునది విస్రబ్ధనవోఢ ప్రశ్రయ మనఁగా సంభోగపరిచయమువలనఁ గలిగినవిశ్వాసము.ము చేష్టలెవ్వియనఁగా:—క్రీడాసమయమందు సిగ్గుచేత నింపులు గులికెఁ పనులుచేయుటయుఁ బతిమీఁదఁ దానలిగినప్పుడు సయితము మెత్తనఁ టయు నూతనవస్త్రాలంకారములమీఁదఁ గోరిక గలుగుటయును.

—• సాధారణముగ్ధ కుదాహరణము •—

చం. ఒనర శుభాంగిపై శుభముహూర్తమునం జొరఁగాను వాస్తుష
జను వలరాజునానతిని సల్పఁగఁ బద్చుదనంబు పూనుచుం

గనుఁగవయుం మొగంబు నలకాటుకపిట్టలఁ జంద్రుఁ బిల్చె నిం
పొనరఁగఁ బిల్చె మాట యమృతోదధితుంగతరంగకాంతులన్.

—• అజ్ఞాతయౌవన కుదాహరణము •—

మ. జలకంబాడి తటంబుచేరి నవలా శ్యామంబుగా నంటె ను
త్పలమో యియ్యదియంచుఁ జేఁబుణికె నేత్రవ్యాప్తకర్ణస్థలిన్
నలి లేనాఁచని యూరుదుష్ప్రికొనియెం దా శ్రోణిభారంబునుం
దెలియంజాల కిదేల డస్సితిఁ జెలీ నేనంచుఁ బల్కాబనున్॥

—• జ్ఞాతయౌవన కుదాహరణము •—

తే.గీ. శంభువోచును మఱియు స్వయంభువోచు
నోప్పఁజున్నది నీచన్ను త్రిప్పులాఁడి
కోమలీ యిఁక నేధన్యుగోటిచేత
ధరణి నది చంద్రచూడాఖ్యఁ దనరఁగలదు. 7

—• నవోఢ కుదాహరణము •—

చం. పరఁగఁగఁ జేతఁబట్టికొని పానుపుపైఁ బవళింపఁ జేసి వే
యుననురంబునందునిచి యొత్తిననున్ వెలిఁబాఱఁజూచుఁదా
సరగి నవోఢ హస్తమునఁ జిక్కఁగఁ బాదరసంబసందును
స్థిరముగి నిల్పఁగాఁగలఁడు చేపడువానికిఁ గాదు వశ్యగాన్. 8

—• విస్రబ్ధనవోఢ కునాహరణము •—

చం. తనప్రియునొద్దకేగి తగఁ దాఁబవళించె నవోఢ వింతగాఁ
గనుఁగొన లింతమూసికొని గట్టిగ నీవినిబట్టి బాహుతో
డను గుచయుగ్మమందున బెడంగుగ హస్తతలంబు పట్టి యొం
దును నొకయింత సందిడక దొడ్డతొడల్ బిగియంగఁ బట్టుచున్.

—• మధ్య •—

సిగ్గును మనస్సును సమానముగాఁగల నాయిక మధ్య. ఇదియే యతిప్రశ్రయముతో నను వర్తించే నే నతివిస్రబ్ధనవోఢ. అతిప్రశయ

మనఁగా సంభోగపరిచయాధిక్యమువలనఁ గలిగిన విశ్వాసము. దీని చేష్టలెవ్వియనినఁ బ్రియుఁడు తప్పుచేసినప్పుడు తాను ధైర్యవంతురాలైన వానితోఁ గుటిలముగా మాటలాడును. తానధైర్యవంతురాలైన వానితోఁ గఠినముగా మాటలాడును.

—• మధ్యకుదాహరణము •—

ఉ. నిద్దురవోతినేఁ బ్రియుని నెమ్మొగముం గనకున్నఁ జాల నే
నిద్దురవోవనే నతఁడు నెమ్మి ననుం గరపల్లవంబుతోఁ
దిద్దియుఁ బ్రేమఁ బట్టకొనుఁడా నని చింతయొనర్చుచున్నదై
నిదుర పోయిపోనటుల నీరజలోచన యొప్పె నేర్పుతోన్. 10

—• ప్రగల్భ •—

రతియొదపమాత్రమె కేళీకలాపమందలి చాతుర్యముచూపునాయిక ప్రగల్భ. భోగముదానికిఁ గంక్లేశమే లేదు కావును జారిణీక ళా పురుషులుగలుగు కావును బతిమాత్రవిషయకత్వము లేమిచే వారి చేసి [illegible]దు. ఈనాయికచేష్టలు రతియందుఁ బ్రతిగిలిగియుండుటయు రత్యానందముచే నొడలెఱుఁగ పరవశయై యుండుటయు.

—• రతిప్రీతిమతికుదాహరణము •—

ఉ. చన్నులుపట్టి మోముగని చక్కఁగ నొంబు కవుంగలించుమం
దన్నన మోవి నొక్కి తొలఁగంగను జేయుచుఁ బరముంగురుల్
పన్నగఁ బైకిఁ ద్రోచి పతి భానుఁడు పొడ్చెనొయంచుఁ జూచువోఁ
గన్నన వీనుగల్వ సరిగ ప్రకొనెక్ వసనాంచలంబులన్. 1

—• సురతాంతసమ్మోహవతికుదాహరణము •—

చం. అతివ వినంగదే చనులయందలి గిల్లులు మోవి గంటులున్
చ్యుతమగు పువ్వుఁగడలును జొప్పడఁ జాఱిన తారహారముల్
రతిసమయాంతమందునఁ దొడంబుగఁ గంటి నివెల్లఁ గ్రీడలో
స్మృతి యెడయెడ యేడరతి యే శభనత్కృతశిక్ష నెచ్చెలి. 1

## మధ్యాప్రగల్భల యవాంతరభేదములు

మానావస్థయందు ప్రగల్భలు ధీరయనియు నధీరయనియు ధీరాధీరయనియును ప్రత్యేకము మూఁడేసి విధముల వారగుదురు. మానమనఁగా నలుక.

వ్యంగ్యముగా నలుకచూపునది ధీర.

అవ్యంగ్యముగా నలుకచూపునది యధీర.

కొంతవ్యంగ్యముగాను గొంత యవ్యంగ్యముగాను నలుకచూపునది ధీరాధీర.

ఇంకొక విశేషము గలదు. మధ్యలలో ధీర తనయలుకనుమాటలతోఁ జూపును. అధీర కఠినములైనమాటలతోఁ జూపును. ధీరాధీర మాటలతోను నేడుపులతోను జూపును. ప్రౌఢలలో ధీర తనయలుకను రతియందలియుదాసీనతతోఁ జూపును. అధీర తర్జనభర్జనాదులతోఁ జూపును. ధీరాధీర రత్యౌదాసీన్యముతోను తర్జనభర్జనాదులతోను జూపును.

ఈధీరాదిభేదములు స్వీయకే కాని పరకీయకు లేవని ప్రాచీనులు చెప్పిరి కాని యది యాజ్ఞామాత్రముగాని యనుభవవేద్యము కాదు. ఏమిటికంటె ధీరత్వము నధీరత్వము ధీరాధీరత్వము నను మూఁడును నలుకయొక్కడనుండు నక్కడనుండును. పరకీయకు నలుక వచ్చునేని దానికిఁగూడ నివి యావశ్యకములు. పరకీయ కలుక యుండదని చెప్పుటకు శక్యము కాదు.

### మధ్యధీర కుదాహరణము

తే.గీ. కోర్కి లోలాళిపుంజనికుంజమందుఁ
బోవ నీమేని చెమ్మటల్ పూరిమయ్యెఁ
దామరాకులవీవన దాల్చి లెస్స
గాలితగులంగ వీతునా కాంతనీకు.

— మధ్యాధీర కుదాహరణము —

శా. నీకుఁ రేయిట జాగరంబగుటయున్ నేత్రంబులెఱ్ఱంబడెన్
నాకుఁ మద్యము నీవుత్రాగుదు మదిం దబ్బిబ్బు నాకయ్యెడుం
ఘాకం దేఁటులు కాచునట్టి పొదరింటన్నిమ్మ పండ్లీవుహా
కై కో నగ్నిసుతీక్ష్ణబాణములచేఁ గంతుండు నన్గొట్టెడున్. 14

—• మధ్య ధీరాధీర కుదాహరణము •—

మ. అనురాగంబు జనింపఁజేసెదు మనోజ్ఞాకారివై యొప్పదీ
వనఘా భర్తవు లేఁతజవ్వనముచే సందంబునుంగాంచి తం'
చని నిట్టూర్పునిగిడ్చి పద్మముఖి తాసత్యంత బాష్పాంబువుల్
దనుకంజొచ్చినదృష్టి భర్తముఖపద్మంబందు నిల్పెంగదే. 15

—• ప్రగల్భధీర కుదాహరణము •—

చం. తలఁపవు పాన్పుఁజేరఁగ సుధారసమొల్కెడుకుల్కుఁబల్కులం
బలుకవు కంటఁజూడ విటభామరో భృత్యజనంబుమీఁద నీ
యలుకలు చూపునట్టిమిష నారయనియ్యది యల్కనాపయిం
దెలిసితిఁ గాని చో నిపుడు నీచెలితానటుచూచి నవ్వనే. 16

—• ప్రగల్భాధీర కుదాహరణము •—

చం. తనప్రతిబింబముం దనరఁ దన్నగజాసతి చంద్రరేఖలో
నను గని వేఱుఁగల్కిఁ దననాథుఁడు దాల్చె శిరంబుమీఁదనం
చనుపమరీతిఁజేసెఁగదె యాతనిఁదర్జనభర్జనంబు ల
ల్కను జనియించు గాజుల ధగద్ధగకాంతుల వెల్గుచేతితోన్. 17

—• ప్రగల్భ ధీరాధీర కుదాహరణము •—

చం. అనువున భర్త పాన్పుదఱియం గని మోముత్రిప్పి గద్గద
స్వనమున వాఁడు పల్కుటయుఁ జక్కని చెక్కిళులుబ్బ వంకన
వ్వును నగి చేతఁజే యతఁడు పొందుగఁబెట్ట రుషారుణంబులై
తనకొడు దృష్టిబాణములఁ దా నవలా పఱపెం దళుక్కనన్. 18

—• ధీరాదిభేదముల కవాంతర విభాగము •—

ఈధీరాదిభేదము లాఱును జ్యేష్ఠయుఁ గనిష్ఠయు ననుభేదములచే రెండేసివిధములగును. వివాహితయై మగనికిఁ దనమీఁద మక్కువ యెక్కువగలది జ్యేష్ఠ. మగనికిఁ దనమీఁదఁ మక్కువ తక్కువగలది కనిష్ఠ. మగని యెక్కువమక్కువయుఁ దక్కువమక్కువయుఁ గల పరకీయలకును సామాన్యలకు నీజ్యేష్ఠాకనిష్ఠావిశేషణములు చెల్లవు. ఏమిటికంటే వివాహితయనువిశేషణము వారిని బహిష్కరించుచున్నది.

—• జ్యేష్ఠధీరకును గనిష్ఠధీరకు నుదాహరణము •—

మ. ఒకసెజ్జం బ్రియ లిద్దఱు న్నిదురవో నుత్కంధరుం డై సం
దొకస్త్రీ వల్వ ముసుంగువెట్టికొని తాను న్వంచనం గాంచి వే
ఱొక స్త్రీయొద్దకు నల్లనేగి ముని వ్రేళ్ళోప్పార నాడించు చిం
చుక తద్వస్త్రపు చెంగులెత్తి ప్రియుఁడచ్చో మేలుకొల్పెన్బతే. 19

—• జ్యేష్ఠాధీరకును గనిష్ఠాధీరకు నుదాహరణము•—

మ. అలుకం బూనిన యిద్దఱు ప్రియల నుద్యానంబులోఁ గాంచి వా
రలలో నొక్కతె నమ్రమవక్త్రి ననువారంబంచి పూల్గోయఁ గ
న్నులకొల్కుల్ తగ సామునే తెఱచి తన్నున్నెయ్యసం జూచు మో
మలరన్ హాళిని సాము మోవినగు నన్యం గౌఁగిలించెంగదే. 20

—• జ్యేష్ఠధీరాధీరకును గనిష్ఠధీరాధీరకు నుదాహరణము•—

చం. తనర నధైర్య ధైర్యములు తప్పక తాల్చెడు స్త్రీలఁ దన్వఁగాఁ
దనవగు రెండు గుప్పిళులఁ దాలిచి మేలగు కెందురత్నముల్
పొనరనొకర్తె చేతినిడి పొందుగ నొక్కటి యన్యచన్ను దా
ననువుగఁ జేయి చేపెనఁగు నమ్మిషఁ దాఁకి ప్రియుండు కుల్కగా॥ 21

ఇది స్వీయానిరూపణము

ఇంకఁబరకీయాని రూపణము.

పరపురుషుని మీఁద రహస్యానురాగముగల నాయిక పరకీయ. ఇదియును బరోఢయనియుఁ గన్యయనియు రెండు విధములది. కన్య తండ్రి మొదలగు వారి యధీనమందుండుటచేతఁ బరకీయ యగును. దీని చేష్టరహస్యముగానే యుండును.

వివరణము:—పరకీయ యనఁగాఁ బరాధీనురాలు. పరోఢ యనఁగాఁ బరునిచేఁ బెండ్లియాడఁబడినది.

పరోఢకుదాహరణము:—

చ॥ సుమశరసేవ చేయఁదగి చొప్పడె నీ పొదరిల్లు లేవరో
హిమితతటాంతవీవిదళదేలలవాసన దాల్చె గాడుపుల్
సమయము క్రొమ్మెఱుంగిఁగడుఁ జాతురిఁ జేప్పెడు ధన్యురాలు చి
త్తమెదియొ పారవశ్యమునఁ దా సలుపఁగను గోరె నెచ్చెలీ॥ 22

గుప్త-విదగ్ధ-లక్షిత-కులట-అనుశయాన - ముదిత-వీరులోనగు వారు పరోఢలోనే యంతర్భావము పొందుచున్నారు.

గుప్తయనఁగాఁ దనఅంకితేరులకుఁ దెలియకుండునట్లు దాఁచునది. ఈగుప్త

(1) వృత్తసురతగోపనయనియు

(1) వర్తిష్యమాణసురతగోపనయనియు

(3) వృత్తవర్తిష్యమాణసురతగోపనయనియు మూఁడువిధములది.

ఇందు మొదటిది జరిగిన సురతము దాఁచునది. రెండవది జరగనున్న సురతము దాఁచునది. మూఁడవది యీ చెప్పిన రెండు విధముల సురతమును దాఁచునది.

—: మూఁడువిధముల గుప్తకు నుదాహరణము :—

మ. ఇల మాయత్తకుఁ గోపమైన మఱిమాయేరాలుతా దెప్పినం
జెలులు న్నవ్వినఁ బవ్వళింప నిఁక నాచేఁ గాద యీయింటిలో

## కులట

జారుల యిండ్లకుఁ దిరుగు స్వభావము గలది కులట.

### దీనికుదాహరణము

చ॥ పురుషుల నీవు మేఘములు పొందుగ నిచ్చును వర్షబిందువుల్
ధర గిరు లిచ్చు శాద్వలములం దగనాయకులర్ రచింప నీ
తరువు లొసంగుఁ బండ్లిడవు తథ్యముగా వి టులైన వారలర్
ధర విటి కేమిచేసితివి ధాత వచింపుము మొట్టపెట్టెదర్. 2

## అనుశయాన

సురతవిఘ్న కారణముచే విచారించునది యనుశయాన. ఈయనుశయానలు మూఁడువిధము లగువారు గలరు. ఎట్లంటేని—

(1) ఉన్న సంకేతస్థాన మూడినదని దుఃఖించువారును

(2) ఇటమీఁద సంకేతస్థానము దొరకదని యెంచి దుఃఖించువారును

(3) తాముపోకయే తమప్రియులుమాత్రము సంకేతస్థానమునకుఁ బోయి వచ్చిరని దుఃఖించువారును.

అని.

వీరిలో మొదటితరగతి యనుశయాన కుదాహరణము:-

తే॥ గీ॥ పరగఁ జైత్రము రాఁగా లవంగలతల
యాకులెల్లను రాలినవగుటఁ జేసి
నాతి బంగారువన్నె గండస్థలములు
తాటియాకులవన్నె యదాల్చె నకట॥

రెండవతరగతి యనుశయాన కుదాహరణము: —

మ. కలికీ ఖేదమువీడవే ప్రియతమాగారంబునుం జేరవే
నలి నిద్రించు నెమళ్లజంటలను సన్నంబౌకపోతాళిచేఁ

జలియింపంబడు క్రొత్తపల్లవములన్ సొంపొందు నుద్యానముల్
చెలియా యచ్చటనెన్ని లేవు చెపుమా చిత్తంబునం జూడుమా. 29

మూఁడవ తరగతి యనుశయాన కుదాహరణము.

తే. గీ. ఒయ్యఁ జెవిలోనఁ దాల్చిన తియ్యమావి
పూలచేఁ బింజరంబౌచుఁ బొలుచు కృష్ణు
చెక్కుఁ ళులుగాంచె రాధ తాఁ గాంతచేత
నుదకధారలు కన్నులనుండి కాఱ. 30

ముదిత.

సురతము దొరకునని కాని దొరకినదని కాని హర్షము పొందు
నది ముదిత.

దీని కుదాహరణము:—

మ. తనకొట్టంబున నిద్రవోయెఁ బతి సాంధ్యా యాఁడుబిడ్డంటివా
వినఁగాజాలదు లోకికోడలనిసె వీక్షింపఁగా లేదు సు
మ్మనుచుం జేటికచెప్పగా వినుచు నత్యంతంబు రోమాంచముల్
తన చన్గొండల నంటి పైఁదరుణి తాఁ దాల్చెం గదే పైకగాన్. 31

పరకీయలో రెండవవిధముదైన కన్యకుదాహరణము:—

చం. సరములొలికింతవంగ బొమచక్కఁగనిల్పుచు మందహాసముం
బరపుచుఁ బ్రక్కఁ గన్గొనలవాల్చుచు పృథ్వ్యతి వీనుఁగల్వతా
నొరిమ బుజమ్ముపై నొరగ నుగ్రపు వేలను వీనుగోకి కొం
చరియఁగ రాచకన్నెక నెవ్యాజమునం దగ నొక్క ధన్యునిన్. 32

ఇది పరకీయానిరూపణము.

## సామాన్యానిరూపణము

ఇఁక సామాన్యా నిరూపణము చేయుచున్నాము.

ద్రవ్యముకొఱకుమాత్రమే పురుషులందఱిమీఁదను ననురాగ
గల నాయిక సామాన్య. అట్లయిన నగ్నిమిత్రరాజుమీఁద నను

వివరణము:—ప్రేమగర్విత యనఁగా మగనికిం దనమీఁదం బ్రేమగలదని గర్వించు నాయిక. సౌందర్య గర్విత యనఁగా దనసౌందర్యమును మగఁడు మెచ్చికొన్నాఁడని గర్వించు నాయిక.

ప్రేమగర్వితకుదాహరణము:

తే. గీ. సకియ నీమేన రత్నభూషలు మగఁడె
యమరనిడు ధన్యురాల వేనుందు నేను?
అరసి కంటికి మే నెడ మానటంచు
నగలు తొడుగఁడు నాపతి నాదు మేన. 35

సౌందర్య గర్వితకుదాహరణము:—

తే. గీ. కన్నులకు సాటి మేలైన కమలములును
మాటలకు నల్ల యమృతంబు సాటియును
తెలియ దేమందు నాపతిం జెప్పఁగదవె
చాలఁ దప్పయ్యె నే నది సైఁచుటెల్ల. 36

మానవతి

ప్రియుఁడు ప్రతికూలవిషయముఁ జేసిన తప్పును సూచించు ప్రియచేష్ట మానమనఁబడును. దీనినే యలుకయందురు. మానముగలది మానవతి. మానము లఘువు మధ్యమము గురువు నని మూఁడు విధములు. లఘుమానము ప్రియుఁడు సవతియొక్క పేరు బలుకుట మొదలగు స్వల్పకారణములచేఁ బుట్టును. అది ప్రియుని కతవచనములమీఁద వేడుక పుట్టించుట మొదలగు స్వల్పకార్యములచేఁ దీర్పఁదగ్గది. మధ్యమమానము ప్రియుఁడు నోరుజారి ప్రియురాలిని వేఱొకతె పేరను బిలుచుట మొదలగు గొప్ప కారణములచేఁ బుట్టును. అది బొంకులు బొంకుటయు నొట్టు పెట్టుకొనుటయు మొదలగు గొప్ప కార్యములచేఁ దీర్పఁదగ్గది. గురుమానము ప్రియుఁడు సవతియొకతెతో సంభోగించుట మొదలగు మిక్కిలి గొప్పకార్యములచేఁ బుట్టును. అది

భేదములచేత గ్రహింపఁగూడదు. జాతిభేదములచేత గ్రహింతుమేని నాయికలకుఁ బోలె నాయకులకుఁ గూడ ననంతములైన భేదములు వచ్చును. ఇంద్రాదులు దివ్యులనియు మనుష్యు లదివ్యులనియు నర్జునాదులు దివ్యాదివ్యులనియు వచ్చును.

మఱియును ముగ్ధలలో ధీరాదిభేదములు లేవు. ఏమిటికంటే నాయికాయవస్థలకు తగు ప్రజ్ఞాసామగ్రి వారికి లేదు. ఈధీరాదిభేదములు చెప్పఁగూడని యట్లే ముగ్ధకుఁ బ్రోషిత భర్తృకాద్యవస్థభేదంబులుకూడఁ జెప్పఁగూడదు. ఐనను బ్రాచీనుల మతము ననుసరించి ముగ్ధనుగూడఁ గలిపికొని యీయవస్థాభేదంబ లెఱిఁగించుచున్నాము.

1. ప్రోషితభర్తృక.

భర్త దేశాంతరము పోయియున్నపుడు సంతాపముచే వ్యాకులముపొందు నాయిక ప్రోషితభర్తృక.

వివరణము :—ప్రోషితభర్తృక యను సమస్తపదమునకుఁ బ్రోషితుఁడు భర్తగాఁగలది యని యర్థము. ప్రోషితుఁడనఁగా దేశాంతరము పోయినవాఁడు.

కలహాంతరితలయు విప్రలబ్ధలయు నుత్కలలయుఁ బతులు దేశాంతరగతులు కాక కాన నన్నాయికలకు ప్రోషిత భర్తృకాలక్షణము వ్యాపింపదు.

—ముగ్ధయగు ప్రోషితభర్తృక కుదాహరణము.—

మ. తనలోఁ దా నొనరించు లజ్జఁ జెలితోఁ దాఁ జెప్పదే మాటయుఁ
గనదన్నాఁ చున సెజ్జపై నెపుడుఁ దాఁ బవ్వళింపంగఁబో
దును డగ్గుత్తికఁ బల్కఁగాని గరిమం గంట నీరూన దా
ఘనసంతాపము సైఁచె నెట్లు సతియాకాంతుం డెడఁబాయఁగ జుమీ. 40

—:మధ్యయగు ప్రోషితభర్తృక కుదాహరణము:—

ఉ. నామొగిఁ గట్టుపుట్టమదె నాదగుచేఁ గడియుంగ నయ్యె దే
నామొలనున్న యట్టిరతనంబుల మేఖలసూలు నయ్యె దే

కామిని భృంగగీతసుభగంబయి వెల్గెడు నీవసంతమున్
దేమిటికమ్మ పెద్దవయి యియ్యవి యెల్లను దోఁచె నెచ్చెలీ. 41

—• ప్రౌఢయగు ప్రోషిత భర్తృక కుదాహరణము •—

మ. జలజాక్షుండు ప్రయాణమై చనుటయుం జంద్రాస్య లేఁదమ్మిమే
కులదండల్ మొలనూలు ముత్తియములంగుల్కొందుహారంపుఁ జే
టలునుం బోయెను నాడె కూడెడిదొ యాడంజాలదో చూడఁ జే
నలయుం బేగెను బాహుమూలముననా కావామాక్షి కెట్లుండునో. 42

—• పరకీయయగు ప్రోషితభర్తృక కుదాహరణము •—

మ. తనకుం దామరతేకు లత్తయిడఁగాఁ దా బొమ్మనన్నంగొనుం
దనచేఁ జెల్ పెళలాడునంచు భయమై తానంట దేత్రాలహో
తనుఁ బృచ్ఛించిన నుత్తరంబు నొసఁగుం దాఁ జేటినోర్లే వాలుతా
శన తీక్ష్ణంబగు శ్వాసము న్విడువ దాచంద్రాస్య యింతేనియున్.

—• సామాన్యయగు ప్రోషిత భర్తృక కుదాహరణము •—

చం. విరహమునందుఁ బ్రేమ దెలిపన్ ధనమ్మెనని విన్న యట్టిదై
బరవిషయంబునుండి పతివచ్చి మహాధనమిచ్చునంచుఁ దాఁ
బురవనజాక్షి ద్వారమునఁ బొందుగ నంతయుఁ గూరుచున్నదై
మిరియపుముద్ద కంటనిడి మిక్కిలికార్చెను బాష్పబిందువుల్. 44

—• ఖండిత •—

మతియొకతెతో సంభోగించినచిహ్నలు గలిగి తెల్లవాఱు జామున మగఁడువచ్చు నాయిక ఖండిత యనఁబడును. తెల్లవాఱు జామనునది యుపలక్షణము. అనఁగా రొక్క తెల్లవాఱుజాము మాత్రమేగాక యేమతియొకయవేళ యయినను గావచ్చును. ఈ నాయిక చేష్ట లెవ్వియనిన నస్ఫుటముగా మాటలాడుటయుఁ జింత నొందుటయు సంతాపముపడుటయు నిట్టూర్పువిడుచుటయు మౌనము దాల్చుటయుఁ గన్నీరుగార్చుటయు మొదలగునవి.

— ముగ్ధయగు ఖండిత కుదాహరణము —

తే. గీ. కలశముద్రలు బొమ్మనఁ గానఁబడియెఁ
గారణం బేమియని యడుగంగ మదిని
దలఁచినట్టి నవోఢయా తరుణికనులు
పాణితలమున మూసెను బ్రాణవిభుఁడు. 45

— మధ్యయగు ఖండిత కుదాహరణము —

చం. తనపతిదైన బొమ్మనను దద్దయు నాఁటిన చన్నుచిన్నెలం
గని పొడవూర్పును న్విడువఁ గాంచదు పల్కదు కొంచెమైననుం
దనదగు మోము గడ్డికొను తత్సమయంబున వేకువం జలం
బునఁ దగఁ గప్పిపుచ్చుఁ గనుఁ బొందుగ బాలిక కంటినీటినిన్. 46

— ప్రౌఢయగు ఖండిత కుదాహరణము —

చం. చనఁబగదానిపాదజలంబులలత్తుకదైన నా మొగం
బును గని మోము వాంచికొని పొల్చెను జిత్తురునందు బొమ్మవో
లెను బరువమ్మలాడ దెడలింప దొకింతయు వేఁడియూర్పుశో
భనకరమైనయద్ద మిఁక బట్టి మనఃప్రియ చూపు వేకువన్. 47

— పరకీయయగు ఖండిత కుదాహరణము —

చం. వరుమెడ విస్ఫుటంబుగను భాసిలుకంకణముద్ర గాంచి యుం
బరువపుఁబల్కు లక్కలికి పల్కదు లోకుల కుల్కియక్కటా
కరమునిగిడ్చి దూతికమొగంబున దూరమునందు నుండియే
సగున బాష్పపూరములు జాఱెడు కన్గొన పుల్కుచూపులన్. 48

— సామాన్యయగు ఖండిత కుదాహరణము —

మ. ఇదె నీబొమ్మన నంటె దానిచను లింకేనెట్టులోర్వంగఁ జా
లెద నాకిచ్చెద నన్నయట్టి ధనముల్ వేపోయి మాత్రమోలనం
చదిరా బోగముచాన లాగికొనెఁ దా నంతస్సునంజంకుభ
ర్త దియాప్తెఁడి కడెంబు ఘల్లుమనఁ దద్ధస్తంబునందుండివే. 4

## కలహాంతరిత

ముందఱ మగని నవమానించి వెనుకఁ జింతించు నాయిక కలహాంతరిత. దీని చేష్టలు భ్రాంతియు సంతాపమును మూర్ఛయు నిట్టూర్పును జ్వరమును బలవరింతయు ననునివిలోను గాఁగలవి.

### ముగ్ధయగు కలహాంతరితకుదాహరణము

తే. గీ. అనునయింపదు సిగ్గుచే ననుఁగుమగనిఁ
జెప్ప దోకయించుకైనను జెలులతోడ
మఱియు మలయానిలము వీచుతఱిని గట్టి
పట్టును నవోఢ తనగుండెఁ బద్మప్రొద్దు. 50

### మధ్యయగు కలహాంతరితకుదాహరణము

తే. గీ. చెలులతోఁ జెప్పినంగాని చెడదు వంత
చెలులతోఁ జెప్పఁదమటన్న సిగ్గుపోడము
ననుచు దలవాంచి ప్రియునకుఁ దనకునైన
కయ్యమును జెప్పనూనంగఁ గాంత తలఁచె. 51

### ప్రౌఢయగు కలహాంతరితకుదాహరణము

తే. గీ. ఎఱ్ఱవాఱితి నేత్రమా యేలమోసి
ఒయ్య నీవక్షమైతేల యోసిచేయి
ఓసినాలుక జగడంబు చేసితేల
హితమెఱుంగరు దైవోపహతులు కట్ట. 52

### పరకీయయగు కలహాంతరితకుదాహరణము

సీ. అవని నెవ్వానిఁ గోరియలఁతులఁ బూజించి పరిగణింపఁగనైతిఁ బరులనింద
కోలుపోతిని ధైర్యమూలధనంబెల్లఁ దృణముఁ బోలెను సిగ్గునెడపియుంటిఁ
జిన్ననాఁటనునుండి నన్నంటి యున్నట్టి దాక్షిణీతికిఁ జాలదూరమైతి
నల్లకల్లోలమై యారెడు పెకేళ్ళ నీటిబొట్టులఁ బోలెదాఁటియుంటి

నల్లనాదు ప్రాణవల్లభునమ్మరో
నేను బుద్ధిలేనిదాన నౌచు
నలిగిచేసియుంటి నవమానితుఁడు గాఁగ
దైవఘటనమకట దాఁటవశమె. 53

—• సామాన్యయగు కలహాంతరిత కుదాహరణము •—

సీ. పాణిపద్మమునందుఁబద్మరేఖలు లెస్సఁగాలుచున్నవటన్న మేలిమాట
యరసిచూడంగ భాగ్యస్థానమందునగురుఁడున్నవాఁడన్న గుఱుతుమాట
భాగ్యశాలినియంచు ఫాలదేశంబున బ్రహ్మవ్రాసెనటన్న నాసిమాట
యెవ్వాడునను గూడ నిఖిమూఁడుసత్యమై చెలియరో యెంతేని చెన్నుగాంచె
నల్లప్రియుమీఁద నెంతేని యలిగినట్టి
దాననైతిని గటకటా ధరణినింక
నేమిటికి నేను నాప్రాణమేటి కతనుఁ
డేటికి విలాసమేమిటి కేలవయసు. 54

4. విప్రలబ్ధ.

సంకేతగృహమునందుఁ బ్రియుఁడుకనఁబడమిచే హృదయములోఁ దల్లడిల్లు నాయిక విప్రలబ్ధ. దీనిచేష్టలు హేయత్వబుద్ధియు నిట్టూర్పు విడుచుటయు సకియలను దప్పుపట్టుటయుఁ జింతయుఁ గన్నీళ్ళు గార్చుటయు మూర్ఛయుననునివి మొదలయినవి.

—• ముగ్ధయగు విప్రలబ్ధ కుదాహరణము •—

మ. చెలు లొల్లన్నియు పెట్టికొంచుఁ గడుఁ బొచ్చెంబాడి కుంజంబులో
పలికంపంబ్రియుఁడందు లేమి మది క్షోభంబంది రానివ్వలే
కళి తా డప్పిని సోలుచున్నయపు డేయౌత్సుక్యముంబొందునో
యలయౌత్సుక్యపుచూడ్కి నెల్లెడ నవోఢాబ్జాస్యవీక్షించెఁదా.

—• మధ్యయగు విప్రలబ్ధ కుదాహరణము •—

తే. గీ. పోయిసంకేతగృహమునఁ బురుషు లేమి
నిభృతనిశ్వసితోష్ఠయై నీరజాక్షి

సగము తెలిచినకన్నును సగముపలుకు
పలుకు సగమునమలినతమ్మలము నమ్యె. 56

—• ప్రౌఢయగు విప్రలబ్ధకుదాహరణము •—

మ. పొదరింటంబతిలేమిగాంచి కనియాపూవిల్తుకౌటిల్యమున
మదిలోఁ జెప్పకదూతికైనఁ జెలికైనం బ్రశ్నచేయుంగిఁబో
కదిరా శూలి లలాటనేత్రి విషకంఠా మన్మథారీ హరా
సదయస్వాంతత నన్నుఁబ్రోవుమనుచుం జంద్రాస్యవేడెన్ శివున్.

—• పరకీయయగు విప్రలబ్ధకుదాహరణము •—

సీ. ధైర్యంబు నానోప్పదర్వికరముని త్తిమీఁదఁ గొనము ఎట్టిమెట్టిమెట్టి
సిగ్గనియెంతేని చెన్నారునయ్యెను తలఁకింతయును లేక దాఁటిదాఁటి
నీచపూరుషులనునిందుఁజీకటిముద్దనెలమితోఁ దుతెఁజాలఁగోలిచికోలిచి
యున్నిచేసినదయ్యు నిందీవరదళాక్షి కటకటా తనప్రియుఁగాన లేక
పరితపించుచు నెల్లెడబహువిధముల
యుఱిమిచెలలాడు నల్లమబ్బాయ్యెఁగాంచి
యుసుకుపితమూచు అంకవేయుచును నచ్చు
యమునిదైనట్టి దున్నపోతునుమ నంగ. 58

—• సామాన్యయగు విప్రలబ్ధకుదాహరణము •—

మ. అనిశంబున్ రసికాళివంచనము చేయంగల్గు నివ్వారకాం
తనుమాయల్ తగఁబల్కు నొక్కయతఁ డత్యంతంబువంచింనెనం
చునునిట్టట్టుభ్రమించు తేఁటులను దృష్టుల్ లెన్సగాఁజాఁచిన
వ్వెను దాఁబూచిన పూలడాలుమిషచే వేకేళికుంజంబటన్. 59

5. ఉత్క.

సంకేతస్థలమునకు భర్తరామికిఁ గారణమాలోచించునాయిక
యుత్క.

నడువునాఁటికి భర్తరాని ప్రొషితభర్తృక కీలతుణము పట్టదు.

ఆనాయిక భర్తకు నియమము గడుపునాఁడింటికి రావలయునని. ఇల్లు సంకేతస్థలముకాదు. సంకేతశబ్ద మానాయికను బహిష్కరించు చున్నది.

ఈనాయిక చేష్టలు ప్రీతిలేమియు సంతాపము నావులింతయు నొడలివిఱుపును వడకు నేడ్పును దనయవస్థచెప్పికొనుటయు మొదలు గాఁగలవి.

—• ముగ్ధయగు నుత్క కుదాహరణము •—

మ. సనుగూడంగను నింకరాఁడు పతి యేనారీమణింగూడెనో
యనిచింతించియు నద్దఁబోదు చెలిఁ దానబ్జాస్య పెన్సిగ్గుచే
తను నిట్టూర్పునిగుడ్చ దేగ దెమరుం దాభీతయై దోరబం
ఁసిన నీరుల్లిదియైన పాండురపువన్నెం దాల్చెఁ జెక్కిళ్లలన్. 60

—• మధ్యయగు నుత్క కుదాహరణము •—

మ. ఘనురాలో చెలిపిల్వఁబోదొ బతిమార్గంబందుఁ బాముున్నదం
చును భీతిల్లినవాఁడొ నేనువలదంచుంబల్క నన్నలైనో
యని తానొక్కనవోఢ కర్ణకుసుమంబందుండి రాల్ధూళిచేఁ
గనుదమ్ముల్ కదుముడెనన్నమిసచేఁ గన్నీరు గార్చెంజుమీ. 61

—• ప్రౌఢయగు నుత్కకుదాహరణము •—

తే. గీ. అక్కపొదతిల్ల! చెలిమొల్ల! యమ్మరాత్రి!
తల్లిచీఁకటి! కరుణిపు తల్లిమావి!
ఒకటియనిగెదఁ జెబ్బుమా యుదధరాభి
రాముఁడగుకృష్ణుఁ డిటకుఁ దా రాఁడదేల. 62

—: పరకీయయగు నుత్క కుదాహరణము :—

సీ. నీరదంబులు తాముసీరముల్ కురియుచో స్నానంబుచేసినదాననైతి
ఘనమైనకాననంబున కిట్టులేతెంచి తగవసించిన యట్టిదాననైతి

జల్లనై యొప్పారు చందనబిందుసందోహంబు లెంతేని దోయిలించి
చెఱకువిల్తుం బ్రౌఢిమం జెలంగు దేవరభక్తి నసరంబూనించినదాననైతి
నమరగేయెల్ల జాగరం బాచరించి
సిగ్గునత్తిణగా నిచ్చి చిక్కియుంటిఁ
దపము లీరీతిఁ జేసిన దాననైన
నతఁడు నాకన్నువిందు గాఁడయ్యె నేల.

— సామాన్యయగు నుత్కంఠితోదాహరణము —

తే. గీ. ఇప్పుడు రాఁడయ్యెఁ బొదరింటికేల కాంతుఁ
డనుచు నెంతేని దలపోసి మనసులోన
నోడమె మీఁదను గలయాశఁ బోడముకంటి
నీటఁ బొదరిల్లు బోగము బోటి తడిసె. 64

6. వాసకసజ్జ.

తనప్రియుఁడు రానున్న దినమున నేఁడు నాప్రియుఁడు వచ్చు దినమని సంభోగోచితమయిన సామగ్రి యెవ్వతె సిద్ధపఱచికొనునో యానాయిక వాసకసజ్జ.

వివరణము:—వాసక మనఁగా వాసరము. సజ్జయనఁగా సిద్ధము

ఈనాయిక చేష్టలు:—కోరికలుఁ జెలితోఁ బరియాచకమాడుట—దూతికను బ్రశ్న వేయుట—సామగ్రిని సంపాదించిపెట్టికొనుట—దారివంకఁ జూచుట—యివి మొదలుగాఁ గలవి.

— ముగ్ధయగు వాసకసజ్జకుదాహరణము —

సీ. తారకాంతులచేత ధగధగలాడంగ రమణతో డుతను హారంబు గ్రుచ్చు
మెఱపుఁదీవియపోలె మెఱయుచుండెడి మేలిరతనాల మొలనూలు
రమణఁ గ్రుచ్చు
శయ్యాగృహములోన సమ్మోదమారంగ దీపంబు వెలిఁగించుఁ దివిరితివిరి
అల్లదీపమునకునై దానిప్రమ్మిదలోన నిండుగఁ దోల్తమానెయిడదు

ఇట్టులారేయి తానవోఢేందువదన
ప్రక్క మోమయి చిఱునవ్వుపరిఢవిల్ల
నెదుటు చూచుచునుండెఁ దానెంతయును ర
హస్యమై కోర్కికనురూపమైనపనికి. 65

—॰ మధ్యయగు వాసకసజ్జ కుదాహరణము ॰—

సీ. తనశిల్పచాతుర్యమును జెలులకుఁ జూపు నెపమునఁ దనమిఁజనీరజాస్య
రమణీయతరమౌచు రంజిల్లు నెత్తుకల్వలపూవుదండ తాఁ బరగఁ గ్రుచ్చు
ద్వారపార్శ్వములందుఁ దనరఁగోడలమీఁదఁ జిత్రింప వెలుఁగొందు
చిత్తరువుల
వీక్షించుమిష చేతఁ గింతకింతలుగాఁగ ద్వారపుస్మపలుమాఱుపరగఁ జూచుఁ
జెలులకున్నట్టి సొమ్ములు గెలువఁగోరు
నెపముచేఁ గ్రొత్తసొమ్ములు నెమ్మిఁదాల్చు
నిట్టియారామపోకల నెఱిఁగిమరుఁడు
తోడుతోఁదాల్చెఁ జిఱునవ్వుతోడి మొగము. 66

—॰ ప్రగల్భయగు వాసకసజ్జకుదాహరణము ॰—

చ. తనరఁగ మేన సొమ్ములను దాల్చి శిరోజములందు ధూపముం
బొనరిచి పాన్పు చెంగటను బోకలు నాకులమర్చి పెట్టి య
ల్లనఁ దనపట్టుటిల్లు నవలాతగఁ జొచ్చి శరీరకాంతులన్
ఘనముగ వెల్గు నేఁ గులకాంతులఁ గప్పెను దద్గృహంబునన్. 67

—॰ కోరిక కుదాహరణము ॰—

క. చెలి మాయురువుయంగం
బులు వేర్వేఱైన విరహపు టుపద్రవమాఁ
గలసినతఱిఁ జిఱునవ్వులు
బలియఁగ నొండొరులఁ జూచు భాగ్యము పోవున్. 60

మదనమహోత్సవములును మదాహంకారములును మనోరథలబ్ధియును.

## —• ముగ్ధయగుస్వాధీనపతికకుదాహరణము •—

సీ. నడుముచూడఁగసన్నంబించుకయుఁగాదు పాలిండ్లలోపల బలములేదు
పరికింపఁబిఱుదులోవైశాల్యమేలేదు నడకలోపలనుమాంద్యంబు లేదు
చూపులోనింతైనఁజూడవంకరయులే దాటయందునను దార్ఢ్యంబు లేదు
మాటయందినుమంతపాటవంబును లేదు పరగనవ్వునఁబ్రగల్భత యులేదు
అంగమింతయులేదు దేహంబునందు
నైననావిభుఁడనే నాదుప్రాణవిభుని
నెమ్మనమ్మెల్లకాలంబు నిలిచియుండుఁ
గారణంబేమొ నాకెఱుఁగంగరాదు. 71

## —• మధ్యయగుస్వాధీనపతికకుదాహరణము •—

చం. సురతమహోత్సవంబునను సుందరి నే వలదంచుఁజెప్పినం
గరమును నేను బోఁకముడికప్పుచుఁగట్టిగఁబట్టికొన్ననుం
బెరిమెను బార్శ్వదేశమునువీడక యీపతి పట్టికొంచుఁ దా
నరయుఁగఁ బ్రాఁకులాడె సకియా యపుడేమియొనర్తుఁజెప్పుమా.

## —• ప్రౌఢయగుస్వాధీనపతికకుదాహరణము •—

సీ. జగతిలోపలఁగాంతులగునట్టియవ్వార లెల్లవారెల్లెడ నెల్లనాఁడు
భాగ్యశాలిను లైనవారిజాక్షులవౌచుఁ దఁగారువదఁ పద్మములు చూచి

చివురుమోవులుచూచి చిల్కపల్కులుచూచి నాట్యంబులుంజూచి నవ్వుఁజూచి
పరమసంతోషసంభరితాంతరంగులై వేయినోళ్లనుస్తుతుల్ సేయుచుండ

నన్యకాంతను స్వప్నమందైననాదు
కాంతుఁడెన్నఁడుఁజూడండనుకంటెనేమి
వినఁడుచెవితోడఁ దలఁపండుమనసులోన
నెట్లతెఁడుతారతమ్యంబు నెఱుఁగునకియ. 73

—• పరకీయయగుస్వాధీనపతికకుదాహరణము •—

మానినీవృత్తము:—

బంగరుగాజులు మేల్మొలనూళ్ళును వజ్రపుఁగమ్మలు ఘల్లుమనన్
సింగురుసింగురుమంచును నింటను స్వీయలునిచ్చలుఁ గ్రాలుచునుం
డంగను మిద్దెపయిం బురవీధి వనంబున నల్గురిలో నెటనై
నం గనుఁచుం బతి దృష్టినినిల్పునునావయినే చలియేలయొకో. 74

—• వేశ్యయగుస్వాధీనపతికకుదాహరణము •—

చం. అమృతపువార్థి వార్ల హరినంటిన తామరతేకుసొంపుతో
నమరెడుదృగ్విలాసపుమృగాయతలోచన లెల్లయిండ్లలో
నమర విచిత్రమన్మథకళాతిశయార్థి నితండు నాకె ఱ్ఱొ
క్క మతిమనోహరంబుగను గాంతరొ యిచ్చుచునుండు నేలకో.

8 అభిసారిక.

ప్రియునియొద్దకుఁ దానుబోవునదియును బ్రియుని దనయొద్దకు చికొనునదియును నభిసారిక.

ఇది పరకీయగావచ్చును స్వీయగావచ్చును. పరకీయయైనచో చేష్టలెవ్వియనిన-సమయానురూపమగు వేషమును సమయానురూప భూషణములును ధరించుటయు జంకును దెలివియు నేర్పును

గపటమును సాహసము ననునివిలోనుగాఁగలవి. స్వీయమైన వో సహ
మైన వేషభూషాదులే దీనిచేష్టలు. సమీటికంటే స్వీయ శా నోరులకు
గనఁబడకుండవలయునని తెలుపు మొదలగువన్నెలుగల వేషభూష
ములు ధరించుట సంభవింపదు.

— ముగ్ధయగునభిసారికకుదాహరణము —

సీ. మెఱుమను దూతికాటుగాఁ చంచలనేత్ర యిదెవచ్చియున్నదో యిందుపడ
కేయుసుచెలికత్తెయేయెడనైన నీతోడనేయుండునో తోయజాక్షి
జలదుఁడర్కద్దైవజ్ఞచంద్రుండు మెఱుపుచేఁ బ్రయాణశోభనవేళనము జె
ఝిల్లీరవముచేతఁ ...కి... మొత్తముల్ మంగళవాక్యముల్ పలు దాడఁ
బ్రియునియున్నట్టిచోటికి వెడలఁగాను
దగినసమయంబువచ్చె నోతలిరుఁబోఁడి
యిదె యెఱుంగుము మదిలోన నింక నీవు
మొనసి సిగ్గు విడువుమా ముద్దరాల.

— మధ్యయగునభిసారికకుదాహరణము —

చం. కలికిరో త్రోవలోన భుజగంబులకుల్కక యిప్పునాభుజం
బులనినుఁగౌఁగిలింప నిట ముద్దుగలజ్జవడంకె ద్దెట్టులో
జలదగభీరనిస్వనము జంకకవింటివి నాదుప్రేమసం
కలితపుమాటకుం బెడమొగంబునుబెట్టెద వేమిచేసెదన్.

— ప్రౌఢయగు నభిసారికకుదాహరణము —

చం. అరయ మనోరథంబనెడునట్టిరథంబది లేకయున్నని
ప్పురుసుననుబ్బుగుబ్బచనుభారముచేతను సోలుమేనిదై

సంతిపురముపొచ్చి యసురంగాఁజెక్కిళ్ళ
పయినఁజెమటపట్టఁ బడుచువారు
కొసరికొసరిచేసికొను కౌఁగిలింతల
కతులమంగళమ్ములగును గాత. 82

—॥ సామాన్యాభిసారికకుదాహరణము ॥

సీ. చంద్రికాధౌతమౌ చక్కనిప్పైఁట కొంగొకవంకఁ దూఁగాడ హాయలుగాను
మెఱపుఁదీవియవోలె మెఱుఁగుగాఁగుచున్నట్టి గంటలమొలనూలు ఘల్లురనఁగ
ముద్దారఁగత్తికగాముడి పిక్కటిల్లంగ గుబ్బపాలిండ్లుపైకుబ్బుచుండ
సుగయభానునికాంతికాద్రియై మెయికాంతిమించియెల్లెడలవ్యాపించుచుండ

నాగసయిసయట్టి బంగారుసొమ్ములాడ
నయనముల కెంపుపుట్టించునడకలోడ
నెలమి నొకధన్యపాదరింటికేగుచున్న
దిదె కనుంగొను వెలయాలి నిందువదన. 83

ముగ్ధలోనగు పదునొకండ్రునాయికల కష్టవిధనాయికాభేదములను జెప్పుచో వారివారికునుపవలయుప్రధానగుణములు:—

ముగ్ధకులజ్జప్రధానము.
మధ్యకు లజ్జామన్మథులు
ప్రగల్భకు వెల్లడిచేయుట
ధీరకు ధైర్యము.
అధీర కధైర్యము.
ధీరాధీరకు ధైర్యాధైర్యములు.

జ్యేష్ఠకు స్నేహాధిక్యము.
కనిష్ఠకు స్నేహన్యూనత.
పరోఢకు మఱుఁగుపెట్టుట.
కన్యకు ముగ్ధకుఁబోలెనే లజ్జ
సామాన్యకు ధనలాభము.

---

ప్రవత్స్యత్పతిక

"ప్రస్థానం వలయైః కృతం ప్రియసఖైరస్రైరజస్రం గతం
"ధృత్యా న క్షణమాసితం వ్యవసితం చిత్తేన గన్తుం పురః
"యాతుం నిశ్చితచేతసి ప్రియతమే సర్వే సమం ప్రస్థితం
"గన్తవ్యే సతి జీవిత ప్రియసుహృత్సార్థః కిముత్సృజ్యతే"

అనునిది మొదలుగాఁగల ప్రాచీనకవుల లక్ష్యములుండుటంబట్టి యేనాయికమగఁడింకొక్క నిమిషమునకుఁ బరదేశమునకుఁబోవనిశ్చయించికొనెనో యానాయికను బ్రవత్స్యత్పతికయని తొమ్మిదవ నాయికగాఁ జెప్పవచ్చును. ఏమిటికంటే నీనాయికభర్త దీనియొద్దనే యుండుటచే నిది ప్రోషితభర్తృకలలోఁగాని విప్రలబ్ధలలోఁగాని యుత్కలలోఁగాని చేరదు దీనికిఁ గలహములేమింజేసియు నిది పతినవమానింపమింజేసియు నిది కలహాంతరితలలోఁ జేరదు. మఱియు సన్యోపభోగచిహ్నములతోఁ బ్రియుఁడువచ్చుటగాని యట్లువచ్చిన ప్రియుని మీఁద నిది యలుగుటగాని లేమిఁ జేసియు దీనిమనస్సులోనున్న ప్రేమ కాకుస్వరముతోఁగూడిన దీనిమాటలవలనను దీనిబెదరుచూపులవలనను గనఁబడుటంజేసియు నిదిఖండితలలోనుం జేరదు. మఱియు దీనికి వాసరనియమముగాని సురతసామగ్రిని సిద్ధపఱచికొనుపనిగాని లేమిం జేసియు నిర్వేదాదుల కలిమింజేసియు నిది వాసకసజ్జలలోను జేరదు. ఇంకొక్కనిమిషమునకే పతితోడిసాంగత్యమున కెడబాపుకానున్నది

గాఁ నిది స్వాధీనపతికలలోను జేరదు. స్వాధీనపతికకెన్నఁడును బతి సంగతివిచ్ఛేదము లేదని సంప్రదాయము. పతి తాను బోవుచున్నను స్వాధీనపతికచే నిరోధింపఁబడి నిలుచును. అట్లు నిలువఁడేని వాని స్వాధీనతకు భంగముకలుగును. ఈప్రవత్స్యత్పతికవిషయములో నట్లు కాదు. దీనిమగఁడు విదేశమునకుఁబోవుట తప్పకజరగనునికింజేసియు దీనికి వనవిహారాదిమదనమహోత్సవవ్యతిరేకములయిన కిఞ్చిన్నిర్వేదంబును నశ్రుపాతంబును నిశ్శ్వాసంబును గలిమింజేసియు దీనినిస్వాధీనపతికనాఁజనదు. మఱియు దీనికభిసారోత్సవము లేమింజేసియు సంతాపము కలిమిఁ జేసియు నిది యభిసారికలలోను జేరదు. ఈప్రకారము మేము యుక్తముగా గ్రహించుచున్నాము. మఱి యిక లక్షణ మెట్లంటే నాయకుఁడు భర్త దేశాంతరముబోనునికింజేసి సంతాపముచే వ్యాకులతఁబొందునాయిక ప్రవత్స్యత్పతిక. దీనిచేష్టలు:— కాకువచనము—దీనపుఁజూపులు—ప్రయాణవిఘ్నముల కెదురు చూచుట—నిర్వేదము—సంతాపము—మూర్ఛ—నిట్టూర్పువిడుచుట—కన్నీళ్లు—నివి మొదలుగాఁగలవి.

ముగ్ధాప్రవత్స్యత్పతికకుదాహరణము.

తే. గీ. పయనముం గూర్చి పతి యేదొ పలుకుచుండ
మోము వాంచెను గోముతో ముద్దురాలు
నాటుగాఁ జెలి పొదరిల్లు సరగఁ జేరి
కొమరలుఁ వెక్కెకో యెలకూఁతఁ గూసె. 84

మధ్యాప్రవత్స్యత్పతికకుదాహరణము

చం. పతి సతి పోయివత్తునని పల్కుటయు న్నగిఁ డింపదయ్యెఁదా
సతిపొడవూర్పు గాష్పములుచయ్యనఁ గాల్చెను గంటఁ దోడుతో
మతిఁ గలవెంప్రడుకల్ చని కదున్ రభసంబున నౌర ప్రాలెఁ
య్యతివలలాట దేశమున నాయువుప్రాల్ చదువం గనోయనన్. 85

—• ప్రౌఢాప్రవత్స్యత్పతికకుదాహరణము •—

శా. ఈనాడావిరహజ్వరంబుచన దింకేఁజచ్చినట్లమాధవా
కానం జేతులుమోడ్చి వేఁడెదను నిక్కంబీవుచెప్పంగదే
సూనంబుల్ జలగంధముల్ తములముల్ చుట్టంబులీ వాసుదే
వా నేఁడుంబలె నందు దుస్సహవిషజ్వాలావళుల్ గావుగా. 86

—• పరకీయాప్రవత్స్యత్పతికకుదాహరణము •—

సీ. పన్నగంబుశిరస్సుపైనను రెండుపా
దంబులుఁ బెట్టినదాననైతి
గురుజనంబులమీఁదఁ గోర్కితో నుంపంగఁ
దగుభక్తివిడిచినదాననైతిఁ
గులకాంతలకునుండవలసినయలనీతి
తగవేఁదివిడిచినదాననైతి
నీకునై యీరీతి నేనేమిపాపంబు
ధరణిలోఁజేయునిదాననైతిఁ
దనువునకునూఱురెట్లయాతనయు మఱియు
నయనములకునురౌరవనరకబాధ
యెడఁదకునగుండ పాకంపుటునుకు నాకుఁ
జనును నీదుప్రయాణావసరమునందు. 87

—• సామాన్యయగుప్రవత్స్యత్పతికకుదాహరణము •—

చం. తనరఁగఁగంకణంబుప్రతి దాల్చెద నుంగరమిమ్ము నిన్నుఁబా
సిన నిదిజాఱిపోవుఁగదె చేతనుదా నిమిషంబునీవ్వడిం
చనువుగఁ బల్కి భోగముది యక్షికినేలకునేకధారగాఁ
గను గనునీళ్లుకాఱుచుచుఁ గాంతునిహస్తముపట్టె బల్మినిన్. 88

ప్రకారాంతరమున నాయికాభేదములు:-

మఱియు నాయికలు ప్రకారాంతరమున మూఁడువిధముల వా రగుదురు. వారెవ్వరనిన—

ఉత్తమ-మధ్యమ-అధమ-

ఉత్తమనాయిక.

ప్రియుఁడు తన కప్రియముచేసినను వానికిఁ బ్రియముచేయు నాయిక యుత్తమనాయిక.

—: ఉదాహరణము :—

మ. పతి చక్కచిన్నెలతోమ్మ్మతోడ శయనింపన్ రాఁగ వీక్షించి తా
సతి ప్రేమాస్పదవాక్సుధారసమునన్ సంతర్పితుం జేసి సు
స్మితశుభ్రప్రభగంధపంకరసముం జెన్నారఁగాఁ బూసి శో
భితలోలాక్షిచమత్కృతాంబుజములం బెంపారఁ బూజించెఁజూ.

మధ్యమనాయిక.

ప్రియుఁడు తనకుఁ బ్రియముచేసినయెడఁ బ్రియమును నప్రియ ముచేసినయెడ నప్రియమునుజేయు నాయిక మధ్యమనాయిక.

ఉదాహరణము.

మానినీవృత్తము.

తప్పొనరించిన పెన్మిటి తైకనుదాఁకుటయున్ మొగమవ్వలికిం
ద్రిప్పిగుపారుణమన్మథబాణసుతీక్ష్ణకటాక్షయయ్యె యతండా
ముప్పఱ మ్రొక్క స్మితంబను కేసరముల్ పలుకన్మధువుల్ తిగువం
జెప్పఁగలేనిప్రియంబను వేలుపుచెట్టు సుదారత దార యిడెన్. 90

అధమనాయిక.

ప్రియుఁడు తనకుఁ బ్రియముచేసినప్పుడుసైతము వానికప్రియ ముచేయునది యధమనాయిక. ఈనాయికయే నిష్కారణముగాఁ

గోపపడునది యన్యోనేని యది చండియనఁబడును. ఇది నిష్కారణము
కోపముదాల్చునది యగుటంచేసి దీనిచేష్ట లధమచేష్టలే.

ఉదాహరణము.

సీ. నీప్రయాణపువేళ నెమ్మోముదమ్మిపైఁ
బద్మాతపత్రింబుపట్టునెవఁడు
శ్రద్ధతోనీత్రోవ చల్లనాచంద
దళివధారలనుముందుతపునెవఁడు
పర్యంకమున నీవు పవళింపఁబోవుచో
మల్లెపువ్వులుతెచ్చి చల్లునవఁడు
చెక్కిళ్ళపై నీదుచెమటార్పఁగా వట్రి
వేళ్లవీవనతోడవీచునెవ్వఁ
డట్టిప్రియునిమీఁద నక్కటా పవడంపు
నీటిమేటఁబొంగినిగుడునలల
సుడిని దిరిగి మిగుల సొక్కినతమ్మిపై
కులనబోలుకనుల లిగదేల. 91

గ్రంథవిస్తరభీతిచే నీముగ్ధాదినాయికలకు వేర్వేఱుగా నుత్తమ
మధ్యమాధమభేదముల నుదాహరింపము.

ఇది శ్రీవాధూలసగోత్రతాడూరి రామరాయపండితాగ్ర
పుత్ర త్రికవిమిత్ర లక్ష్మీనరసింహరాయపండిత
ప్రణీతంబైన శృంగార రసమంజరి
యందు ద్వితీయప్రకరణము.



# తృతీయ ప్రకరణము.

## సఖీనిరూపణము.

నాయికకు విశ్వాసవిశ్రామకారిణియై పార్శ్వచారిణియై యుండునది సఖి. దీనిపనులు సింగారించుట-యుపాలంభించుట-బోధించుట-పరిహాసమాడుట-యనునివి మొదలుగాఁగలవి.

— సింగారించుటకుదాహరణము —

చం. తనరఁగఁ జన్నుపైఁడిములదాఁపునన్ మకరీమిషంబుచే
తను బ్రియుహస్తపల్లవముఁ దద్దయుమెల్ల రహస్యవృత్తిచే
తను వెరవార వ్రాయుచు ముదంబునఁబొంగెడుదానినిన్ సఖిన్
గని కమలంబు చేతఁగొని కంజదళాక్షి యడంచె దానితోన్. 92

— ఉపాలంభమునకుదాహరణము —

మానిని.
నీరదపఙ్క్తులు దిక్కులఁ గ్రమ్మోతలునెక్కొన బెళ్ పెళ యుర్మ్రుచునం
ధారలచేతను భూవలయంబును దడ్పెదునెల్లెడఁ గావుననే
మారమణీమణి పెద్దయుస్నేహము మానసమందునఁదాల్చెనునీ
వారయ స్నేహముదాల్పమియన్నది యచ్చెరువయ్యెనుభూరమణా.

— బోధకుదాహరణము —

మ. తనరం బూఁబొదరింటికింజనఁగదే తన్వంగిరో గోపబా
లుని జూడంగను బోదుగాక యిదియాలోచించికొమ్మా దినం
బుఁ ఝుంకారములెస్సచేయు మధుపంబుల్ గ్రాలుచుండుంజుమీ
యనయంబున్నిశఁదచ్చకోరములు నోళ్ళాడించుచుంగ్రాలుఁజూ.

---

93 పద్యము:-స్నేహము = (1) పాడిపిండిని ముద్దగాఁజేయుగుణము: [ఇది నీటి యందుఁగలదు.] (2) అనురాగము.

94 పద్యము:-పగటివేళ నీ మొగముపద్మమని భ్రమసి దానిమీఁదనుమ్మెదలు వ్రాలును రాత్రివేళ నీముఖకాంతి వెన్నెలయని భ్రమసి నీ మొగముమీఁదను జకోరములు కవియును.

### —• పరిహాసమునకుదాహరణము •—

తే. గీ. పడుకగదిగోడపై వ్రాయ వఱలులోక
భర్తపదిమూర్తులందు నెవ్వరిది చెప్పుమ
యేడవదటన్నఁ దోడ్తోఁగ్రహించి చెలికి
సీత చిఱునవ్వుకాంతులఁ జెప్పెబదులు. 95

సఖియల్లే నాయకుఁడునాయికను బరిహసించుటకుదాహరణము.

చం. కనుబొమసన్నఁగాకడవు కాంతరొ నెచ్చెలి కాన నోటిమా
టను గత మేమటంచును బెడంగుగఁగృష్ణుఁడు లేఁతనవ్వున
వ్వినఁ బలుగంట్లనొచ్చుతెనబింబసమానపు మోవితోడి మో
మును దగ రాధ వాంచికొనె ముద్దుగబెద్దయుఁ బ్రొద్దుదేమొకో.

ప్రియుఁడుపరిహసించినల్లే ప్రియురాలుపరిహసించుట కుదాహరణము.

సీ. మహినీరుదివ్యప్రమాణంబుగాదునీ
కేలన్న మిన్నేఱు మౌళిఁగలదు
మఱియగ్ని దివ్యప్రమాణంబుగాదు నీ
కదియెట్టులన్న నీకగ్నికన్ను
మఱిపాముదివ్యప్రమాణంబుగాదునీ
కదినీకుభూషణంబయ్యెఁగాదె
సర్వాత్మకుఁడ వౌట జగతినొండెడియు ది
వ్యప్రమాణంబుగా దరయనీకుఁ
గావునను జూదమున నిప్పుడీవుబలిమి
నపహరించినయట్టినాహారమిమ్ము
టనుచు నవ్వుచుఁ బార్వతియడిగినట్టి
శివుఁడు శోభనములుమీకుఁ జేయుఁగాత. 97

## దూతీనిరూపణము.

దూత్యవ్యాపారమందుఁ బండితురాలగునది దూతి. దీనిపనులు నాయికానాయకులకు సంఘటనము సేయుటయు విరహము నివేదించు టయు నను నివిలోనుగాఁగలవి.

—• సంఘటనమున కుదాహరణము •—

కం. ఇదె రేవచ్చెడుఁ జీఁకటి
యిదె గ్రమ్మెడుఁ బచ్చవిల్తుఁడి డెయుడ రెదు న
న్నదితప్పకు చేయుముత
గ్గది నామదితగులుకొనియెనాతనిమీఁదన్. 98

—• విరహనివేదనమున కుదాహరణము •—

మ. ఘనభూమండలికింబ్రదీపకళికాఁగా బ్రహ్మయెద్దానిఁజే
సెను దద్రాధిక కంతమబ్బుదశవచ్చెం దైవికంబైన తె
న్నునఁ గానం దలవాంచివేడెదను నిన్నుంగృష్ణ త్రైలోక్యమో
యనఘా చీఁకటికాకయుండ నటన్నేహంబీవునిల్పంగదే. 99

---

## నాయకనిరూపణము.

శృంగారరసమునకు నాయికానాయకు లిరువురును నిరూపింపఁ దగినవారు కావున నింకనాయకునిఁగూడ నిరూపించుచున్నాము.

నాయకుఁడు పతియనియు నుపపతియనియు వైశికుఁడనియు మూఁడువిధములవాఁడు.

### పతిస్వరూపము

శాస్త్రప్రకారము పెండ్లియాడినవాఁడు పతి.

ఉదాహరణము:—

మానిని. చల్లనిసాంద్రసుధాకణజాలము చయ్య సుధాకర చల్లఁగదే
అల్లనహీంద్రుఁడ నిల్పెద దేమిటి కల్లఫణంబులు విప్పి కడున్

మెల్లగవీవఁగదే సలిలంబుల మేలగుస్వర్ణది తడ్పఁగదే
అల్లశిరీషసుమాంగిహిమాద్రిజ హా యిదెయెండకుడస్సెఁగదే. 100

---

## పతిభేదములు.

అనుకూలుఁడు దక్షిణుఁడు ధృష్టుఁడు శఠుఁడు నని పతి నాలుగు విధములవాఁడు.

### అనుకూలుఁడు.

కలకాలముఁబరస్త్రీవర్జితుఁడై కలకాలముస్వీయమీఁద వలపు గలవాఁ డనుకూలుఁడు.

### ఉదాహరణము.

సీ. భూమిదేవినీవుకోమలకావమ్మ
సూర్యుఁడాచల్లఁగాఁజూడవయ్య
గాలిదేవరనీవుకరుణతోఁజెమటార్చు
చులుకనై మార్గమావెలుఁగవమ్మ
దండకారణ్యమాతగనీవుమాకుడ
గ్గఱ రాఁగదమ్మ వేకరుణదాల్చి
కొండలారాదారినుండఁ బో కవులకుఁ
దొలఁగరమ్మామీరుతోడుతోడ
నిన్నియేమిటికందురే నెఱుఁగఁజెప్ప
వాఁడను వినుండు నేఁడునాతోడఁగూడ
నడవికిని దాను వచ్చెదనంచు నుత్స
హించుచున్నదియిదె సీత యిందువదన 101

### దక్షిణుఁడు

నాయికలందఱిమీఁదను సమముగా స్వాభావికమైన వలపు గలవాఁడు దక్షిణుఁడు

ఉదాహరణము:—

తే. గీ. వేవు రిద్దె(మోఁలఁ దరుణులు వెలయుచున్న
వారు నిలుపుదుఁగన్నదో యేరిమీఁదఁ
జెపుమ యని వే గగుర్పాటుచెందకనుఁలు
మూసికొనియుండెఁ గృష్ణుండు ముద్దుగులుక. 102

ధృష్టుఁడు.

ఎప్పుడును నిర్విచారముగా నాయికవిషయముయి తప్పులు చేయుచు నెప్పుడును నాయికచేతఁ జీకొట్లుపడుచు నెప్పుడును నాయిక ననుసరించువాఁడు ధృష్టుఁడు.

ఉదాహరణము:—

ఉ. ద్వారమునొద్దఁ డ్డిడితిఁ దద్దయుఁగట్టితిఁగేలు దమ్ములన్
హారముపెట్టి నేనిదురనందితి నైనను దూరమందు న
న్నారసి చూచి పాన్పుకడ నాతఁడు తాఁబవళించె నాదుబం
గారుకడెంబుజాఱ వెకకం గయిసాచుడు వాఁడుకన్నడెని. 103

శఠుఁడు.

కామినివిషయమై మాయచేయుటలో నేర్పరి శఠుఁడు.

ఉదాహరణము:—

సీ. మకరికాపత్రాళిమగువచెక్కుటద్దాసి
చక్కఁగాఁబూదండజడకుఁజుట్టి
భుజదండములమీఁదభుజకీర్తులనుఁబెట్టి
చనులపైముత్యాలసరులమర్చి
యీరీతిపనులచేనేణాక్షిదైనవి
శ్వాసంబునిండుగాసంతరించి

మొలనూలి నలదాని మొలకమచ్చెముసట్టి
నెపమువిూఁదను దాని నీవిముడిని
లేఁతదిరిసెనపుష్పంబు లీలనొప్పి
మెత్తనయినట్టి చేతితో మెలపుతోడ
మెల్లమెల్లన సడలించె నల్లనాథుఁ
డది యెఱుంగదు తా ముద్దరాలొకింత. 104

ఉపపతి.

ఆచారహానికి హేతువగు పతి యుపపతి.

—• ఉదాహరణము •—

సీ. ఇది యనాచారమంచెడలోన శంకించి
కన్నారనొండొరుల్ గాన రెలమి
భుజకీర్తు లొండొంటిఁ బొరిఁదాఁకు చప్పుళ్లఁ
బ్రకటమౌనను భీతి పల్లవింప
నన్యోన్యమొంతేని యాప్యాయముగఁ బెద్ద
కౌఁగలింపఁగఁ బోరు కరములారఁ
బలుకాటులయ్యనే వెలిపుచ్చునను భీతి
దొండపండునఁ బోలుచుండు మోవి
కలుపుదీఱఁగఁ బిల్వరు గళరవంబు
లన్యజనములు విందురో యనెడు భీతిఁ
గడు విజృంభించి చేయరు పుడమిలోనఁ
గామినీ కాముకులకిది యేమిచితము. 105

* ఉపపతియు ననుకూలాదిభేదంబులచే నలుదెఱంగుల వాఁడగును. ఐనను శఠత్వము నియతము. ఇతరములియతములు కావు.

## వైశికుఁడు.

అధిక వేశ్యాసంభోగాసక్తుఁడగు నాయకుఁడు వైశికుఁడు.

•— ఉదాహరణము •—

కవిరాజ విరాజితవృత్తము.

అలరెతుకాంచిక యొపగుమ్రోఁతల నందముఁగాంచెదుపొక్కిలివా
వెలుఁగుల వెల్గుమఁ బాపురపున్రోవలీఁగ విచిత్రతకంఠము వా
వెలుఁగులవెల్గుమ నేదినకన్నుల వెన్నెలపల్లులత్రిప్పులతో
నలరుచునుండెడి భోగము చానలయుంగజరంగమునే వలతున్.

---

## వైశికభేదములు.

వైశికుఁ డుత్తముఁడనియు మధ్యముఁడనియు నధముఁడనియు మూఁడువిధములవాఁడు.

### ఉత్తమవైశికుఁడు.

ప్రియురాలు తనమీఁద నెంతకోపపడినను దాని కుపచారము చేయుటయందాసక్తుఁడగువాఁ డుత్తముఁడు. ఉదా:—

చం. చిఱుకలకొల్కి కెంపలియు చెన్నువహించినయట్టి కన్గొనల్
నలిఁగని పల్కుఁడెల్లునను నవ్వఁడు పీడెము వేయుఁబోఁడు తా
నలిపె నిఁకేమియన్నఁ జెలి శయ్యసమీపముఁ జేరి చెక్కుటం
బుల కలుదాల్చి వాంఛితల పొందుగ ముత్తెపుఁబేరు గ్రుచ్చెదున్

### మధ్యమవైశికుఁడు.

ప్రియురాలు మిక్కిలి కోపించినను గోపముగాని యనురాగము

---

* ఉపపతి యనుకూలాదిభేదంబులచే నలు దెఱంగువాఁడగునను నివిషయములో నాయి కావ్యపీఠిక చూడవలయును.

గాని చూపక తద్దానిచేష్టలచేత దానిమనస్సునందలి భావమును గ్రహించువాఁడు మధ్యమవైశికుఁడు. ఉదా:—

ఉ॥ కానము నవ్వుమోమునను గానము నృత్యము మాటయందు నన్
గానఁగ రక్తపద్మములు కన్నులి వైన ఘనాంబునిల్త మెం
తైనను మాలెగ్రుచ్చఁ జనఁ బ్రాంతిఘబత్రముఁ గేశధూపమున్
మానిని వ్రాయఁ వ్రేయ జనంబదెచేసెను సాంధ్యవేళకున్॥ 108

అధమవైశికుఁడు.

భయకృపాలజ్జాశూన్యుఁడై యిదిచేయఁదగు నిది చేయఁదగదనిలేక కామక్రీడ సలుపువాఁ డధమవైశికుఁడు. ఉదా:—

చం॥ ఎడఁదగుసిగ్గు నుంగరుణ యించుకభీతియు లేక యేపుతో
నడరెను నట్టివాఁడయిన నాతనిచేతను నన్నుఁ గనె
న్నడుఁబడవేసి నొంపఁగ మనంబున నీవు తలంపకమ్మ నా
యెడ లిదె కోమలంబగుచు నొప్పెడుఁ దా వకుళంపు మొగ్గనా॥

---

మానిచతురులు.

మానీచతురులు శఠాంతర్భూతులు.

—• మాని కుదాహరణము •—

చం॥ మనమునివజ్రతుల్యమగు మాటలు చూడఁగ నీళ్లమూటలౌ
ననిన నన ప్రముఁజూచు రయమూర నెపంబిడి లేచిపోయి వె
న్క నుదయమందువచ్చి తనఁగానక పల్కక మోముముచ్చికొఁ
గను బతిఁ బుల్కుపుల్కు నను గామినిచూచినదయ్యె నక్కటా॥

చతురుఁడు.

సమాగమాభిలాషను వాక్కుచేతఁగాని చేష్టచేతఁగాని వ్యంజ్యముచేయువాఁడు చతురుఁడు.

—• వాగ్వ్యంగ్యసమాగమున కుదాహరణము •—

తే॥ గీ॥ రాత్రి చీఁకటి రోదోంతరాళమెల్లఁ
బొదలఁగా నీవు పయనమైపోవుకతన
వననదీప్రాంతములయందుఁ బరిమళాంగి
యయ్యెదరు పాయమెవ్వ రోయబలనీకు॥ 111

—• చేష్టావ్యంగ్యసమాగమున కుదాహరణము •—

తే॥ గీ॥ నెమ్మిఁగాంతుఁడు బంగారు నిమ్మపండు
చేతనిడికొని యేమేమొచేయుచుండ
భవనమందున గోడపై వ్రాసియున్న
సూర్యుచుట్టును జంద్రాస్య సున్నచుట్టె॥ 112

పత్యాదుల భేదాంతరములు.

పత్యుపపతివైశికులు మువ్వురును బ్రోషితులు నగుదురు.

—• ప్రోషితపతి కుదాహరణము •—

సీ. జగతి నెవ్వతెమోము చంద్రబింబంబయ్యెఁ
గన్నెవ్వతెఁ జూడఁ గమలమయ్యె
నేనాలిజడచూడఁ గానాఁచు తానయ్యె
నబల యెవ్వతెమాట యమృతమయ్యె
నేమానినికినమ్మ తామరతూఁడయ్యె
భామ యెవ్వతెబొడ్డు బావియయ్యెఁ
బఱికింపనేకల్కి వళులెల్ల నేఱయ్యె
రమణి యెవ్వతెతొడల్ రంభలయ్యె
నెవతె చేతులు మఱియుఁ బల్లవములయ్యె
నల్లప్రియురాలు నాదైన యక్కనందుఁ
దాను లేదయ్యెనేని నాతాపమునకుఁ
దలఁపఁగా శాంతియేరీతిఁ గలుగఁగలదు. 113

—• ప్రోషితుఁడైన యుపపతి కుదాహరణము •—

చం. జగములఁ గ్రీడసల్పుటకుఁ జన్ద్రనిభాస్య కుతూహలంబుచేఁ
గొలనికిఁ బోవుచుండఁగను గొండొకసాకున నేనుబోయి వే
మొలమిని దోఁగివనిల్వఁ గని యించుక లోఁ జిఱునవ్వుకాంతిచే
సలలితమైన చూపలల సమ్మతిచూపు టెకన్స్మరించెదన్. 114

—• ప్రోషితవైశికున కుదాహరణము •—

మ. ఎలమిన్నీవిని నేను విప్పుతఱి నింతే సడ్డులేకున్కియున్
వలదన్మాటను బల్కకున్కియును నిర్వక్రింబుగాఁ జూచుటల్
కలకల్లాడెడునవ్వు నవ్వుటయు వక్త్రింబెత్తుచుం జూచుటల్
గలవేశ్యాస్మరచేష్టితంబు మది నిక్కంబే స్మరింతు జుమీ. 115

---

నాయకాభాసుఁడు.

అనభిజ్ఞుఁడగు నాయకుఁడు నాయకాభాసుఁడే.

వివరణము-ఇక్కడ ననభిజ్ఞుఁడనగా వ్యంజకసామగ్రియున్నప్పటికినిభావము తెలిసికొనలేనివాఁడని భావము. నాయకాభాసుఁడనఁగా నాయకుఁడువోలె బ్రకాశించువాఁడు. ఏకారము నాయకుఁడు కాఁడని సూచించుచున్నది.

ఉదాహరణము:—

సీ. ఎవ్వారులేనిచో నింట నాతనిఁ గ్రమోలఁ
బలుచమత్కారముల్ సలిపియుంటి
వనవిహార మతండుచననొంటిఁ జేయుచోఁ
బూల్గోయునెపమునఁ బోయియుంటి
భావగర్భితమైనభక్కిఁబల్కులవాని
సొబగుఁజూపులతోడఁ జూచియుంటి

నడపంబు నందించు నన్నెపంబునఁ జేసి
పాలింతులను బయల్ పఱచియుంటి
నిన్నపనలను దూఱికాయిల్లు నేను
జేసితిఁగదమ్మ యభిలాషఁ జేసి మిగుల
నెఱుఁగఁడయ్యె నతఁడు తానింతయేని
యెంతచేసిన నిటమీఁద నెఱుఁగఁగలఁడొ. 116

నాయికకుఁ జెప్పిన యీభేదములు నాయకునకుఁగూడ గల్గుగ
నని చెప్పఁగూడదు. ఏమిటికంటే నాయికకవస్థాభేదములచేత భేద
ములు కలిగెననియు నాయకులకు స్వభావభేదములచేత భేదములు
కలిగెననియునొక విశేషము కలదు. అనుకూలత్వము దక్షిణత్వము
ధృష్టత్వము శఠత్వము నను నీనాలుగే నాయకులకు స్వభావము లేర్ప
డియె. అట్లుగాక నాయకులకుఁగూడ నవస్థాభేదములచే భేదంబులు
చెప్పుదుమేని యుత్కవిప్రలబ్ధఖండితాది నాయకులుండురని యం
గీకరింపవలయుట సంభవించును. అట్లుండుటనుట సంప్రదాయవిరు
ద్ధము. ఏలంటే సంకేతవ్యవస్థయందు నాయికరామి యసాంప్రదా
యము గావున నాయిక రాదయ్యె ననుశంక నాయకునకుండుటకుఁ గార
ణమే లేదు. మఱియు ధూర్తత్వము నన్యోపభోగ చిహ్నితత్వమును
నాయకులకేగాని నాయికలకుఁగావు. నాయికులకుఁ గలవంటిమేని
రసాభసమగును.

నర్మసచివుఁడు.

ఈ నాయకులకుఁ బీఠమర్దవిటచేటవిదూషకులని నాలుగు
విధములవారయిన నర్మసచివులు గలరు.

పీఠమర్దుఁడు.

అలిగిన స్త్రీని దేర్చువాఁడు పీఠమర్దుఁడు. ఉదా:—

కవిరాజ విరాజితము

అంబుగాఁగఁ బోల్చునెయ్యాపగిదిం గరుణాన్విత వాక్యము పల్కఁగాదే
యిల కలవాన సుధాద్రవదీర్ఘిక యింపగుసౌరభ మబ్బఁజుమీ
వలవము లె మ్మభిలాషిణిఁ గంటిని బ్రక్కఁ గదిప్పుచు నెవ్వనిపై
నలిగను పల్మఱు వానితపంబది యంతయు కోకిల శ్లాఘ్యమెంచూ.

విటుఁడు.

కామతంత్ర కళాకోవిదుఁడు విటుఁడు. ఉదా:—

చ. కలునలఁతేఁగ వచ్చె నిదె గాడ్పు దేవర పెంపుగాంచెఁ దా
నలినొవచేసె భీకరతఁ బ్రాణవిభుండిటనుండి పోఁడు వీ
రలకుమిచూడ సిద్ధరసరాజి భిషక్కున వద్యధీ మకుం
డలుకనుజబ్బు నీమనసువంచెటు నిల్చెఁ గృశోదరీ యిఁకన్. 118

చేటుఁడు.

సంధానచతురుఁడు చేటుఁడు.

—• ఉదాహరణము •—

తే. గీ. నందసూనుండు నలచంద్రసుందరాస్య
దైవికంబునఁ బొందరింటఁ దారసిల్లి
అంతలోఁ జెల్మికాఁ డెండయధికమగుడు
జలముఁ ద్రావెదు నెపమునఁ గొలని కేగె. 119

విదూషకుఁడు.

అవయవాదులు వికృతముగాఁ జేసికొని నవ్వుపుట్టించువాఁడు విదూషకుఁడు. ఉదా:—

ఉ. పానపునొద్ద కె త్రిక్కొనివచ్చితిఁ బద్మముఖిలఁగా మమ్ముఁ
చానిదమైన శైకముడిదాఁపునఁ జేయుడి విప్పఁబోతి నే

నానమును న్విదూషకుఁడు హా యట వేణువకోడికూఁతలం
దానొనరించెఁ బల్మఱు ఘనంబగు నిస్వనమొప్ప నక్కటా. 120

---

## సాత్త్వికభావములు.

కం. అమరును డగ్గుత్తికకం
పము బాష్పంబులును జెమటవట్టుటరోమాం
చము వైవర్ణ్యంబును స్తం
భముఁ బ్రళయము సాత్త్వికంబు భావములగుచున్. 121

— ఉదాహరణము —

సీ. పకియరో గద్గదస్వరమబ్బె నీమాట
కధరంబు చూడఁగా నదరఁజొచ్చె
నక్షిగోళములందు నశ్రువుల్ కడుఁ గ్రమ్మెఁ
బాలిండ్లు చెమ్మటల్ పట్టఁదొడఁగెఁ
బొలఁతి నీమొడలెల్లఁ బులకరింపఁగఁజొచ్చె
గండస్థలంబెల్లఁ బాండువయ్యెఁ
జరణంబులంజూడ స్తంభించియొప్పారె
లయమయ్యె మనసెల్ల లలితగాత్ర
నయనములు రెంటియందు మాంద్యంబుపుట్టెఁ
గంటివా యేమి రాజమార్గంబునందు
నల్లగొల్లల దొరయైన యట్టినందు
బాలకుని నేఁడు ముద్దుగోపాలుఁగృష్ణు. 123

---

## శృంగార రసనిరూపణము.

### రతిస్థాయిభావము శృంగారము.

వివరణము:—రతి యేరసమునకుస్థాయిభావమో యారసము

శృంగారము. రతియనఁగా సంభోగవిషయాభిలాష స్ఫురించిన మనోవ్యాపారము.

శృంగారము సంభోగమనియు విప్రలంభమనియు రెండువిధములు.

సంభోగము.

సరసుఁడును సరసురాలును గలసియుండి యొకరినొకరు చూచికొనుటయు నొకరినొకరు తాఁకికొనుటయు ననునివి మొదలుగాఁగల వ్యాపారము సంభోగము.

— ఉదాహరణము —

ఉ. మిన్నసి యాడుచుండఁగను మేఘముజాఱెను గాంతిపుంజసం
పన్నుఁడు చంద్రుఁడుం గదలువాఁడయియుండెనుగూయఁగాఁదొడం
గెన్నలిఁ బావురంబులును గ్రిందికిరాలెను దారకాతతుల్
పన్నగనూఁగెఁ దామమరవాహిని వొకరటంబు లెంతయున్. 123

---

విప్రలంభము.

కారణవిశేషముచే నయ్యిరువురు నెడఁబాసి యునికి విప్రలంభము.

— ఉదాహరణము —

మ. క్రొత్తమబ్బులు పుట్టినంతనె గోర్కె నీతెనుఁజూడఁగాఁ
దత్తరంపడి ప్రాణముల్ చనెఁ దన్వికంఠముదాఁకనుం
గ్రొత్తయొక్కటి నీముఖేందునిఁగూర్చి పైకెగురంగఁబోఁ
గ్రొత్తతామరపాకుసాకునఁ గూర్చె టెక్కను బొమ్మ తా. 124

---

123 పద్యము: ఇందువిషయనిగరణము గలదు: మిన్ను=నాయిక నడుము మేఘము=కొప్పు. చంద్రుఁడు=మొగము. పావురపుఁగూత=మణితము. తారకాతతులు=తెగినముత్తెపు సరులలోని ముత్యముల గుంపులు

## విప్రలంభావస్థలు.

విప్రలంభమందుఁ బదియవస్థలు గలవు. అవి యెవ్వియనిన—నభిలాష—చింత—స్మృతి-గుణకీర్తనము-ఉద్వేగము-ప్రలాపము-ఉన్మాదము—వ్యాధి-జడత—నిధనము.

### అభిలాష.

సంగమేచ్ఛ యభిలాష.

—• ఉదాహరణము •—

కం. ఆరామయనుసరస్సున
నారా నాదామనస్సు నక్షులుఁ బడిమెన్
భారమునమునిఁగెఁదామన
సారయుఁజులుకనయి తేలియాడెడుఁగన్నుల్. 125

### చింత.

సందర్శనప్రకారంబును సంతోషప్రకారంబును దెలిసికొనఁ గోర్కి చింత. ఉదా.

మ. చనినేఁడాపొదరింటిచెంగటికి నేఁ జాలైనయట్లుండి కో
యనుచుం గోయిలవోలె మాటికటఁగూయంజొచ్చెదం దానినిన్
విని తా రాధ వసంతకాలమిదియేనిక్కంబుగావచ్చెనం
చను భ్రాంతింబడి చూపుఁగల్వ రచించుందోరణంబుల్ బలే. 126

### స్మృతి.

ప్రియురాలిపనులు మొదలగువానిచే మనస్సులోఁ గలిగిన సంస్కారమువలనఁ బుట్టినజ్ఞానము స్మృతి. ఉదా.

మ. ఘనదుఃఖంబునఁగుందు రాముఁడువ్యథంగాన్పింపఁ జేయందు శ్వా
సను నుష్ణంబుగవీఁడఁ డక్షులనుబాష్పంబుల్ ధరింపం డహో

---

125 పద్యము నామనస్సు చిన్నదానిలో మగ్నమయినదనియు నాకన్నులు దాని సర్వాంగములమీఁదను దుమ్మెదలవలెఁ దిరుగుచున్నవనియు భావము.

యనిలావర్తవివర్తమానశిఖతుల్యక్రూరకామజ్వరం
బునఁ దాఁ జిక్కి స్మరించుచుండు ననిశంబున్ సీతనో లక్ష్మణా. 127

గుణకీర్తనము.

విరహావస్థయందుఁ గాంతావిషయకప్రశంస చేయుట గుణకీర్తనము.

—• కాంతయనునది కాంతునకుఁ గూర్చినపలుకులు •—

ఉదాహరణము.

తే. గీ. ముదితపాలిండ్లుముట్టు కే ముట్టుటాయి
సుదతిమోమునుఁజూచు కే చూచుటాయి
కాంతవలరాచవియ్యపుఁగతులు చెప్ప
సమయమే యిలఁ జెలికాఁడ సమయమాయి. 127

ఉద్వేగము.

సకలభోగ్యములును దుర్భాగ్యములని మన్మథపీడచేఁ బుట్టెడుబుద్ధి యుద్వేగము. ఉదా.

తే. గీ. ఇందుబింబంబు విషవృక్షకందమయ్యె
నీవసంతుఁడు కరుణాంబుజేభమయ్యెఁ
గనఁగనీరేయి వలరాజుకత్తియయ్యె
నేమిచేసెదవో బ్రహ్మ యింకవిూఁద. 129

ప్రలాపము.

ప్రియురాలినిగూర్చిన కల్పితవ్యవహారము ప్రలాపము.

ఉదాహరణము

తే. గీ. అకటప్రతిపీఠుణము లేనియట్టికన్ను
నకటప్రతిమేళనము లేనియట్టిమనసు

129 పద్యము: కందము=దుంప: కరుణాంబుజేభము=కరుణయను పద్మమున కేనుఁగు: రేయి...యయ్యె=రేయియు మన్మథునియొక్క కత్తియయ్యె చెన్నెలయును వసంతరువును రాత్రియును నన్నుఁజంపుచున్నవి.

హా ప్రితిస్పర్శనములేనియట్టిచేయి
యేమిచేయునునాకివియేటికిపుడు. 130

ఉన్మాదము.

ఔత్సుక్యసంతాపాదులవలనఁ గలిగిన బుద్ధివిపర్యాసముచేఁ బ్రియురాలినుద్దేశించిచేసిన వ్యర్థవ్యాపారమున్మాదము. ఈవ్యాపారము కాయికము వాచికము నని రెండువిధములది.

—• కాయికోన్మాదమున కుదాహరణము •—

చం. వెలుఁగుచునున్నచంద్రుప్రతిబింబముఁజూచి మృగాయతాక్షిదె
యలరెడుమోమటంచుఁ బరిహాసముచేయఁదొడంగి భర్తమా
ర్పలుకువినంగరామి నలభామినిమానమటంచు నెంచుచుం
బులకితహస్తపద్మమున ముట్టెను దత్ప్రతిబింబముంబళీ. 131

—• వాచికోన్మాదమున కుదాహరణము •—

శా. ఏరాచంద్రుఁడ సాటిలేదుగదరా యేణాక్షినెమ్మోముతో
మారాగర్వమిదేల వేఁడుగదరామారామకన్దమ్మిరుం
కారంబిట్టులుసల్పనేమిటికిభృంగా రామమేనట్లుకా
దీరీతుల్దగ విట్టిదెయ్యెడనులేదేసుమ్మి వీక్షింపఁగన్. 132

వ్యాధి.

మదనవేదనచేఁబుట్టిన సంతాపకార్శ్యాదిదోషము వ్యాధి.

ఉదా:—

చం. మనసిజువిల్లు బాణమును మానసమందువసించు నెన్నఁడుం
గనుబొమయుం గటాక్షములకాంతకు నీమదిలోవసించుఁజూ
వినుమిదివారికిట్లుప్రభవించెనుసాటి తనుత్వమొందున
న్నునుననబోఁడియింకనతనుత్వము పొందకయుండఁగావుమా. 133

133 పద్యము: తనుత్వము=కార్శ్యము.

## జడత

జీవమున్నదని వాక్చేష్టావిరహితమయిన విరహావ్యథా మాత్రమే తెలియఁదగినయవస్థ జడత*.

ఉదా:—

సీ. ఘలు ఘల్లుమను పైఁడికంకణంబుల మ్రోఁత
తనరముం జేనుండి వినఁగరాదు
మెఱుఁగుఁ బాలిండ్లపై మెఱయుచుండెడు పైఁట
కాసంతయైననుగదలదయ్యె
నేత్రపద్మములందు నెలకొన్నయలపాప
లావంతయైనఁ దామాడవయ్యెఁ
జెవులకందంబిచ్చి చెన్నారురతనాల
కమ్మలొక్కింతైనఁ గదలవయ్యె
నీదుపేరుచెప్ప నేఁడొకవిధమైన
పులకలెత్తదేని పొలఁతియొడలు
చిత్తరువుననుండుచేడె కీలలితాంగి
కేమిభేదముందు నింకఁ జూడ. 18

## నిధనము.

అమంగళమను కారణముచే మరణావస్థ నిక్కడ చెప్పము.

## దర్శనము.

స్వప్నచిత్రసాక్షాద్భేదముచేఁ దర్శనము త్రివిధము.

---

*జడత : జడతానిర్వచనము విషయములో నాయీ గ్రంథటీక చూడ వలయును.

—: స్వప్నదర్శనమున కుదాహరణము :—

మ. అలనాసోకలలోనఁ దా వకుళమాలందాల్చి యేతెంచి గు
బ్బలపైముత్యపుహారముంగొనక చేబంగారపుంగంకణం
బులునున్ముట్టక రత్నకర్ణకుసుమంబుల్ వీడి కొంపోయె నో
కలికీ నాహృదయంబు చోరుఁడెవఁడో కానంగలేమమ్మరో. 135

—: చిత్రదర్శనమున కుదాహరణము :—

చం. చనుకొనగోటఁగీఱు నుఱిచయ్యానవిప్పునితండునాదునీ
విని నవశంబుగాఁగఱచు విస్ఫుటమౌగతిమోవిపంటితో
నని ప్రియురూపుచిత్రరువునందుఁగనుంగొని తొల్లివోలెనే
మనమునవీఁడదయ్యె నలమానిని మన్మథకేళిభీతినిన్. 136

—: సాక్షాద్దర్శనమున కుదాహరణము :—

సీ. చంచలచిత్తమౌచాంచల్యమునువీడి
యొకనిమేష మ్మిప్పుడుండవమ్మ
నాచెలీ యోసిగ్గనన్ను బాధింపక
యొకనిమేషమ్ముదవ్వుండవమ్మ
అప్పలారా కన్ను ఱెప్పలారా వాలి
కొక నిమేషముమీఁదికుండరమ్మ
కామదేవానీవు కరుణించి నన్నేఁప
కొకనిమేషం బోర్చియుండవయ్య
సిగనమిలిపించె కలువలుచెవులలోనఁ
గొమరుఁజేతులఁబిల్లనగ్రోవి దాల్చి
సుందరాకారుఁ డల్లకృష్ణుండు వీఁడె
యహహా లోచనగోచరుం డయ్యెనాకు. 137

ఉరుమధుస్యందపుంజసుందరినినాదు
ఘనతరామోదరసమంజరినిసుకవులు
పరమదయచేత లోకంబుపాడిదలఁచి
నలుపుదురుగాక కర్ణభూషణముగాఁగ. 188

గద్యము.

ఇది శ్రీవాధూలసగోత్ర తాడూరి రామరాయపండితాగ్ర
పుత్ర త్రికవిమిత్ర లక్ష్మీనరసింహరాయపండిత
ప్రణీతంబైన శృంగారరసమంజరియందు
సర్వంబును తృతీయప్రకరణము.

సమాప్తము.